శ్రీ సాయి

# శివనేశన్ స్వామీజీ జీవిత చరితము



శ్రీ సాయి

# శివనేశన్ స్వామీజీ జీవిత చరితము

పూజ్యాయ ధర్మ పాదాయ
సాయి తత్త్వ వ్రతాయచ
సదాశివాయ శాంతాయ
శ్రీ శివనేశన్ స్వామి గురుభ్యోనమః

★ ★ ★

*1st Edition : March, 1997*
*Copies : 3000*

*Copies can be had from :*
*M. BOSE*
*C/o Sri Sai Lakshmi Gas Service*
*B-21, 1st Phase*
*Vanasthalipiram*
*Hyderabad - 500 070*

*and also at* ***SHIRDI***

*Price : Rs.* ***9-00*** *only*
*(Postage Extra)*

*Printed at*
**Sri Lalitha Art Printers,**
Narayanaguda, Hyderabad - 500 029
Phone : **7600765**

ఓం సాయి  శ్రీ సాయి  జయ జయ సాయి

# మనవి

శ్రీ సాయి బాబా అభయ సూత్రాలలో అతి ముఖ్యమైనది **''ఎవరైతే ఎల్లవేళలా నానామాన్నే స్మరిస్తారో, నా సేవలోనే సంతోషాన్ని పొందుతారో, నాకర్పించకుండా ఏమీ తినరో అట్టి వారు నాకత్యంత ఆప్తులు, వారి హృదయమే నా నివాసం, వారు నా అంతటి వారు''** అన్న సంగతి మనకందరికి విదితమే. కలియుగంలో కల్పతరువు కన్నా, కామధేనువు కన్నా మిన్న, సద్గురువులకే సద్గురువు మన బాబా. అట్టి సాయిబాబాని నాల్గున్నర దశాబ్దాలు నిస్వార్థంగా సేవించి, మనసా, వాచా, కర్మణా ఆయననే తన సర్వస్వంగా భావించి బాబా పవిత్ర చరణ సన్నిధికి చేరుకున్నవారు పూజ్య శ్రీ శివనేశన్ స్వామీజీ. బాబా మహాసమాధి చెందిన తరువాత స్వామీజీ వంటి నిస్వార్థ సేవా తత్పరులు మరొకరు లేరంటే అతిశయోక్తి కాదు. అటువంటి సాయి అంకిత భక్తుని జీవిత చరితము సాయి భక్తుల కందించటం సాయి సేవయే నన్న తలంపుతో ఈ పరమ పుణ్య పురుషుని చరితమును మీ కందిస్తున్నాను.

నాకు జన్మ నొసంగిన నా తల్లి దండ్రులకు నన్ను పెంచి పెద్ద చేసిన నా పిన తండ్రి శ్రీ యం. నరశింహ రావు గార్లకు నా హృదయ పూర్వక కృతజ్ఞతాభి వందనములు.

స్వామీజీ జీవిత విశేషాలను ఎంతో ప్రయాసతో సేకరించి నేనడిగిన తక్షణమే తమ అమూల్యమైన సమయాన్ని కేటాయించి తాము సేకరించిన విషయాలను నాకు వివరించి వాటిని ప్రచురించుటకు అనుమతి నొసంగిన శ్రీమతి జరీనా తారాపూర్‌వాల, చైర్ పర్సన్, మెహర్-ధన్ ట్రస్టు, ముంబాయి గార్కి నా కృతజ్ఞతాభి వందనములు.

స్వామీజీ శిష్యుడు ప్రస్తుతము స్వామీజీ మహా సమాధికి నిత్యము, అభిషేకము, పూజా కార్యక్రమములు నిర్వర్తించుచున్న శ్రీమణి (కె. సుబ్రహ్మణ్యం) మరియు శ్రీ పి.యస్. రావు మేనేజరు, ఆచార్య ఎక్కిరాల భరద్వాజ బుక్‌స్టాల్, షిరిడీ, గార్లు నన్ను ప్రోత్సహించి వారి అనుభవములు తెలియ చేసినందులకు వారికి నా ప్రత్యేక అభివాదములు.

ఈ గ్రంథ ప్రచురణలో నాకు అనేక విధముల సహకరించి, ప్రోత్సహించిన అఖండ సాయి నామ సప్తాహ సమితి, కృపా కాంప్లెక్సు, ఆనంద్ బాగ్, హైదరాబాదు-47, వారికి నా కృతజ్ఞతాభి వందనములు.

ఎప్పటి కప్పుడు నాకు తగిన సలహాల నొసంగి ప్రోత్సహించిన మా సత్సంగ మిత్రులకు నా అభివందనములు.

ప్రూఫ్ రీడర్‌గా సహాయ పడిన నా మిత్రులు శ్రీయుతులు జి. సంజీవ రెడ్డి, యం.ఎ., సెక్రెటరీ, శ్రీ షిరిడీ సాయి సంస్థాన్, సాయినగర్, వనస్థలిపురం, ఎన్. రమణ రావు, మరియు

వై. సత్యనారాయణ, హైదరాబాదు, గార్లకు నా కృతజ్ఞతలు.

నేను కోరిన వెంటనే తమ, తమ అనుభవాలను నాకు పంపి వాటిని ప్రచురించుటకు అనుమతించిన స్వామీజీ భక్తులందరికీ నా ప్రత్యేక కృతజ్ఞతాభి వందనములు.

అతి స్వల్ప సమయంలో ప్రత్యేక శ్రద్ధవహించి అతి సుందరంగా ఈ గ్రంథాన్ని ముద్రించిన శ్రీ లలితా ఆర్ట్సు ప్రింటర్సు, నారాయణ గూడ, హైదరాబాదు వారికి నా అభివాదములు.

భాషా పరిజ్ఞానం లేని నేను సాయి బాబా మరియు పూజ్య శ్రీ శివనేశన్ స్వామీజీ ఆశీస్సులతో ఈ గ్రంథాన్ని మీ పవిత్ర హస్తాల కందిస్తున్నాను. ఇందులో తప్పులేమైనా ఉంటే నాకు తెలియ పర్చినచో మలి ముద్రణలో సరిచేయగలనని సవినయంగా మీకు విన్నవించు కుంటున్నాను.

ఈ గ్రంథముపై మీ, మీ, అభిప్రాయములను నాకు తెలియ జేసి నన్నాశీర్వదించ గలరని ప్రార్థిస్తూ...

భవదీయుడు

**యం. బోసు**

# శ్రీ దత్తాత్రేయాష్టోత్తర శత నామావలి

(ప్రతి నామము ముందు 'ఓం' అని చివర 'నమః' యని చదువ వలెను)

ఓం శ్రీ దత్తాయ నమః
దేవదత్తాయ
బ్రహ్మ దత్తాయ
విష్ణు దత్తాయ
శివ దత్తాయ
అత్రి దత్తాయ
ఆత్రేయాయ
అత్రి వరదాయ
అనసూయాయై
అనసూయాసూనవే
అవధూతాయ
ధర్మాయ
ధర్మపరాయణాయ
ధర్మపతయే
సిద్ధాయ
సిద్ధిదాయ
సిద్ధిపతయే
సిద్ధి సేవితాయ
గురవే
గురుగమ్యాయ
గురోర్గురుతరాయ
గరిష్ఠాయ
వరిష్ఠాయ
మహిష్ఠాయ

ఓం మహాత్మనే నమః
యోగాయ
యోగ గమ్యాయ
యోగాదేశకరాయ
యోగపతయే
యోగీశాయ
యోగాధీశాయ
యోగపరాయణాయ
యోగిధ్యేయాంఘ్రి పంకజాయ
దిగంబరాయ
దివ్యాంబరాయ
పీతాంబరాయ
శ్వేతాంబరాయ
చిత్రాంబరాయ
బాలాయ
బాలవీర్యాయ
కుమారాయ
కిశోరాయ
కందర్ప మోహనాయ
అర్ధాంగాలింగితాంగనాయ
సురాగాయ
విరాగాయ
వీతరాగాయ
అమృత వర్షిణే

ఓం ఉగ్రాయ నమః
అనుగ్రహరూపాయ
స్థవిరాయ
స్థవీయసే
శాంతాయ
అఘోరాయ
మూఢాయ
ఊర్ధ్వరేతసే
ఏక వక్త్రాయ
అనేక వక్త్రాయ
ద్వినేత్రాయ
త్రినేత్రాయ
ద్విభుజాయ
షడ్భుజాయ
అక్షమాలినే
కమండల ధారిణే
శూలినే
ఢమరుధారిణే
శంఖినే
గదినే
మునయే
మౌళినే
విరూపాయ
స్వరూపాయ
సహస్ర శిరసే
సహస్రాక్షాయ
సహస్రబాహవే
సహస్రాయుధాయ
సహస్ర పాదాయ నమః
సహస్ర పద్మార్చితాయ

ఓం పద్మ హస్తాయ నమః
పద్మ పాదాయ
పద్మ నాభాయ
పద్మ మాలినే
పద్మ గర్భారుణాక్షాయ
పద్మ కింజల్క వర్చసే
జ్ఞానినే
జ్ఞాన గమ్యాయ
జ్ఞాన విజ్ఞాన మూర్తయే
ధ్యానినే
ధ్యాననిష్ఠాయ
ధ్యానస్థిమిత మూర్తయే
ధూళి ధూసరితాంగాయ
చందనలిప్త మూర్తయే
భస్మోద్ధూళిత దేహాయ
దివ్యగంధానులేపినే
ప్రసన్నాయ
ప్రమత్తాయ
ప్రకృష్టార్థ ప్రదాయ
అష్టైశ్వర్య ప్రదాయ
వరదాయ
వరీయసే
బ్రహ్మణే
బ్రహ్మరూపాయ
విష్ణవే
విశ్వరూపిణే
శంకరాయ
ఆత్మనే
అంతరాత్మనే
పరమాత్మనే
ఓం దత్తాత్రేయాయ నమో నమః

-:-

# శ్రీ సాయినాథ అష్టోత్తర శతనామావళిః

(ప్రతి నామము ముందు 'ఓం' అని చివర 'నమః' యని చదువ వలెను)

ఓం శ్రీ సాయినాథాయ నమః
శ్రీ లక్ష్మీ నారాయణాయ
శ్రీ కృష్ణరామశివ
మారుత్యాది రూపాయ
శేషశాయినే
గోదావరీతట షిర్డీవాసినే
భక్త హృదాలయాయ
సర్వహృన్నిలయాయ
భూతావాసాయ
భూత భవిష్యద్భావ వర్జితాయ
కాలాతీతాయ
కాలాయ
కాల కాలాయ
కాలదర్ప దమనాయ
మృత్యుంజయాయ
అమర్త్యాయ
మర్త్యాభయప్రదాయ
జీవాధారాయ
సర్వాధారాయ
భక్తావన సమర్థాయ
భక్తావన ప్రతిజ్ఞాయ
అన్నవస్త్రదాయ
ఆరోగ్య క్షేమదాయ
ధనమాంగల్య ప్రదాయ
బుద్ధి సిద్ధి ప్రదాయ

ఓంపుత్ర మిత్ర కళత్ర
బంధుదాయ నమః
యోగక్షేమ వహాయ
ఆపద్బాంధవాయ
మార్గబంధవే
భుక్తిముక్తిస్వర్గాపవర్గదాయ
ప్రియాయ
ప్రీతి వర్ధనాయ
అంతర్యామినే
సచ్చిదాత్మనే
నిత్యానందాయ
పరమసుఖదాయ
పరమేశ్వరాయ
పరబ్రహ్మణే
పరమాత్మనే
జ్ఞానస్వరూపిణే
జగతః పిత్రే
భక్తానాం మాతృ దాతృ
పితామహాయ
భక్తాభయప్రదాయ
భక్త పరాధీనాయ
భక్తానుగ్రహ కరాయ
శరణాగత వత్సలాయ
భక్తి శక్తి ప్రదాయ
జ్ఞాన వైరాగ్య ప్రదాయ

ఓం ప్రేమ ప్రదాయ నమః
సంశయ హృదయ దౌర్బల్య
పాపకర్మ వాసనా
క్షయకరాయ
హృదయగ్రంథి భేదకాయ
కర్మ ధ్వంసినే
శుద్ధసత్వస్థితాయ
గుణాతీత గుణాత్మనే
అనంత కల్యాణ గుణాయ
అమిత పరాక్రమాయ
జయినే
దుర్ధర్షాక్షోభ్యాయ
అపరాజితాయ
త్రిలోకేషు అవిఘాత గతయే
అశక్య రహితాయ
సర్వశక్తిమూర్తయే
సురూప సుందరాయ
సులోచనాయ
బహురూప విశ్వమూర్తయే
అరూప వ్యక్తాయ
అచింత్యాయ
సూక్ష్మాయ
సర్వాంతర్యామినే
మనోవాగతీతాయ
ప్రేమమూర్తయే
సులభ దుర్లభాయ
అసహాయ సహాయాయ
అనాథ నాథ దీనబాంధవే

ఓం సర్వభార భృతే నమః
అకర్మానేక కర్మ సుకర్మిణే
పుణ్యశ్రవణ కీర్తనాయ
తీర్థాయ
వాసుదేవాయ
సతాంగతయే
సత్యనారాయణాయ
లోకనాథాయ
పావనానఘాయ
అమృతాంశవే
భాస్కర ప్రభాయ
బ్రహ్మచర్య తపశ్చర్యాది
సువ్రతాయ
సత్యధర్మ పరాయణాయ
సిద్ధేశ్వరాయ
సిద్ధసంకల్పాయ
యోగేశ్వరాయ
భగవతే
భక్తవత్సలాయ
సత్పురుషాయ
పురుషోత్తమాయ
సత్యతత్త్వ బోధకాయ
కామాది షడ్వైరి ధ్వంసినే
అభేదానందానుభవప్రదాయ
సర్వమత సమ్మతాయ
శ్రీ దక్షిణామూర్తయే
శ్రీ వేంకటేశ రమణాయ
అద్భుతానంత చర్యాయ

ఓం ప్రపన్నార్తి హరాయ నమః

సంసార సర్వదుఃఖక్షయకరాయ

సర్వవిత్సర్వతోముఖాయ

సర్వాంతర్బహిస్థితాయ

సర్వమంగళకరాయ

సర్వాభీష్టప్రదాయ

సమరస సన్మార్గ స్థాపనాయ

ఓం సమర్థ సద్గురు శ్రీ సాయినాథాయ నమః

-:-

# శ్రీ సాయి శివనేశన్ స్వామీజీ అష్టోత్తర శతనామావళి

(ప్రతి నామము ముందు 'ఓం' అని చివర 'నమః' యని చదువ వలెను)

ఓం గురవే నమః
సాయి స్వరూపాయ
అవధూతాయ
షిరిడీవాసాయ
శివాన్వేషణాయ
సాయినామ ప్రియాయ
ధర్మ స్థాపన వ్రతాయ
ప్రేమ వర్ధనాయ
పుణ్యకర్తాయ
సద్బుద్ధి ప్రదాయ
సద్గతయే
భక్త ప్రబోధకాయ
భజన ప్రియాయ
భక్తానాం సమీకృతాయ
సర్వమత సమాశ్రితాయ
సన్మార్గ వలంబినే
మార్గదర్శికాయ
పతితోద్ధారాయ
ఆశ్రిత రక్షకాయ
ఊదీ ప్రదాతాయ
తీర్థాయ
సాధవే
మంగళమూర్తయే
పూజ్య పాదాయ

ఓంజటాధరాయ నమః
శాంతి మకుట మానాయ
గాంభీర్య మేరు వదనాయ
శాంతాయ
ప్రసన్న వదనాయ
మిత భాషిణే
మృదుభాషిణే
మహిమోపేతాయ
అంతర్యామినే
త్యాగమూర్తయే
పవిత్రాయ
దీప్తమూర్తయే
దివ్యాంబరాయ
శ్వేతాంబరాయ
లోకస్వామినే
విశ్వరక్షకాయ
విశ్వ వందితాయ
సర్వ వందితాయ
సర్వ జన ప్రమోదాయ
సర్వలోక శరణ్యాయ
శుభ ప్రదాతాయ
భక్తోద్ధారాయ
భక్త జన పరి రక్షకాయ
జీవాధారాయ

ఓం ప్రాణ ప్రదాయ నమః
సాయి తత్త్వబోధకాయ
యజ్ఞాయ
యజ్ఞ ప్రియాయ
నిత్యాగ్ని హోత్రాయ
నిత్యాన్నదాన ప్రమోదాయ
గ్రంథ పఠన ప్రియాయ
పరిక్రమవ్రతాయ
నిత్యచావడి భజన ప్రియాయ
నిరహంకారాయ
నిర్మోహాయ
నిరాడంబరాయ
నిర్మల తత్త్వాయ
నిజాధారాయ
నిస్సంగాయ
నిష్కళంకాయ
సద్ధర్మచారిణే
సద్బ్రహ్మ చారిణే
సర్వజ్ఞాయ
జీవన్ముక్తాయ
భావగ్రాహినే
సర్వకర్మఫల ప్రదాయ
మహా మనసే

ఓం జ్ఞానప్రదీపాయ నమః
పావన చరితాయ
ప్రేమస్వరూపాయ
యాజినే
దివ్యావతారాయ
దయాసింధవే
ధీరోదాత్తాయ
దీన నాథాయ
సత్పురుషాయ
కృపానిధయే
కామదహనాయ
కార్యాకారణాయ
కరుణావీక్షణాయ
ఇహపర సుఖప్రదాయ
పాపవిమోచనాయ
మోక్షప్రదాయ
భవపాశ విమోచకాయ
పాపరహితాయ
పరమ పావనాయ
పూర్ణానందాయ
అఘటిత ఘటనా సమర్థాయ
తపోమూర్తయే
తేజోరాశినే

ఓం అచలాయ నమః

అభయప్రదాయ

సదారక్షకాయ

త్రిలోకనాథాయ

మానస చోరాయ

భవ భయ హరాయ

శాశ్వత మూర్తయే

పూర్ణపరేశాయ

దీనదయా ఘనాయ

విఘ్నాంతకాయ

యోగనిద్రాయ

ధర్మాధ్యక్షాయ

సదాచారప్రవర్తకాయ

సత్య స్వరూపాయ

ఓం శ్రీ శివనేశన్ స్వామినే నమః

-:-

## శ్రీ సాయి
## శివనేశన్ స్వామీజీ జీవిత చరితము

సకల దేవతా స్వరూపి సాయినాథుని, ''**మీ భారములు నాపై బడవేయుడు, నేను మోసెదను**'' అన్న అభయాన్ని త్రికరణ శుద్ధిగా నమ్మి, నన్ను నిమిత్త మాత్రునిగా చేసి తన అకుంఠిత భక్తుని చరితమును తానే నిర్విఘ్నముగా పూర్తి చేయించ వలెనని ముక్కోటి దేవతల కాలవాలమైన సాయి చరణార వింద ములకు శతకోటి వందనము లర్పించుచు ఈ గ్రంథానికి శ్రీకారము చుడుతున్నాను.

## స్వామీజీ జననము :

అలనాటి మద్రాసు రాష్ట్రంలోని ప్రముఖ పారిశ్రామిక నగరం కోయంబత్తూరులోని రత్నపేగ పల్లి యందుగల పుణ్యదంపతులైన శ్రీ కాళప్ప నాయక్కర్ ముత్తయ్య, శ్రీమతి అలమేరు ల మూడవ మరియు చివరి సంతానమే మన పూజ్య శివనేశన్ స్వామీజీ. బాబాకు అత్యంత ప్రీతికరమైన పవిత్ర శ్రీరామ నవమి, బాబా మహాసమాధి చెందిన మంగళవారం, బాబా మహాసమాధి చెందిన 8 సంవత్సరా లకు అంటే 1927 సం॥ ఏప్రిల్ మాసం 12వ తేదిన స్వామీజీ వారి మాతామహుల స్వగ్రామమైన నాయక్కర్ పాళాయం అనుగ్రామము నందు జన్మించారు. నాయక్కర్ పాళాయమును పూర్వం తిరుమల నాయక్కర్ అనే రాజు పాలించేవాడు. స్వామీజీకి రంగస్వామి అనే సోద రుడు, అంబుజం అనే సోదరి గలరు.

కొంతమంది పుణ్యపురుషులు జననంతోనే దైవత్వాన్ని వెల్లడి చేస్తారు. శ్రీ దత్తావతారుడైన శ్రీ నృసింహసరస్వతి జననంతోనే ఓంకారాన్ని ఉచ్చరించి తమ దైవత్వాన్ని వెల్లడి చేసిన విషయం మనం దరికి విదితమే.

మన పూజ్య శ్రీ శివనేశన్ స్వామీజీ జననంతోనే రెండు పళ్ళు మరియు బ్రహ్మ జ్ఞాన చిహ్నమైన పిలక తోనూ జన్మించి తాను సామాన్య మానవుడిని కానని కారణ జన్ముడ ననియు తెలియ జేప్పిరి.

స్వామీజీ తల్లిదండ్రులు, మహాతామహులందరు శివ భక్తులే. వీరికి శివారాధనన్న అత్యంత ప్రీతియగుటచే స్వామీజీకి '**శివనేశన్** ' అని నామకరణ మొనరించిరి. **శివనేశన్** అనగా '**శివభక్తుడు**' లేక '**శివుని యందు ప్రేమ గలవాడు**' అని అర్థము.

స్వామీజీ మూడు లేక నాలుగు సంవత్సరాల ప్రాయంలో ప్రతి దినం పగటి పూట సోఫాలో నిదురించే వారు. స్వామీజీ నిదురించే సమయంలో వారి గృహానికి అత్యంత సమీపాన గల ఒక పాముల పుట్ట నుంచి నాగుపాము బయటకు వచ్చి స్వామీజీ శిరస్సు వైపున పడగ పట్టేది. నాగుపాము పడగ పడితే ఆ వ్యక్తి ఉన్నత శిఖరాల నధిరోహిస్తాడని మన ఇతిహాసాలు ప్రవచిస్తున్నాయి. స్వామీజీ దైవ చింతనలోనూ, ఆధ్యాత్మికంగానూ అత్యున్నత శిఖరాల నధిరోహించి ఇతిహాసాల మీదగల నమ్మికను మరింత బలపరిచారు. నాగుపాము పడగ పట్టడం చూచిన స్వామీజీ నాయనమ్మ ఆ నాగుపాము స్వామీజీకి హాని చేస్తుందన్న భయంతో ఆ పుట్టలో పొగ పెట్టించగా ఆ నాగు తరువాత ఎవ్వరికీ

దర్శనమే ఇవ్వలేదు.

స్వామీజీకి ఊహ బాగా వచ్చి మాటలు కూడ మాట్లాడుతున్న ప్రాయంలో ఒక రోజు సాయం సంధ్యవేళ ఊయలలో నిద్రిస్తుండగా స్వామీజీకి శ్వాస బంధింపబడి ఉండటం, నాడి కూడ ఆడకుండుట గమనించి స్వామీజీ నాయనమ్మ కంగారుగా ఇంటిలోని వారిని, చుట్టు ప్రక్కల వారిని పిలవగా వారంతా స్వామీజీని పరీక్షించి మృతినొందా రని తలచారు. కొంత సమయం గడచిన పిదప స్వామీజీ మామూలు స్థితికి వచ్చి వారంతా తనని గూర్చి మాట్లాడుకున్న మాటలన్నీ చెప్పగా వారాశ్చర్య చకితులయ్యారు. వింతలలోనే వింతైన ఈ వింతను గాంచిన వారందరు ఈ బాలుడు దైవాంశ సంభూతుడని తలచారు. అత్యంత నిష్ఠాగరిష్ఠులైన యోగులు సహితం కొన్ని దశాబ్దాలు గురుముఖతా యోగ శిక్షణ పొందినా గానీ సమాధి స్థితి పొందలేని వారెందరో ఉండగా తప్పటడుగులు వేయు చిరు ప్రాయంలోనే మన స్వామీజీ సమాధి స్థితికి వెళ్ళారంటే అది తప్పక వారి పూర్వ జన్మ సుకృతమే గానీ మరియొ కటి గాదు.

స్వామీజీ బాల్యం నుంచి, దైవచింతన, పూజా పునస్కార ములు, దైవ సంకీర్తన లందు ఎక్కువ మక్కువ చూపేవారు. అందరి బాలుర వలె ఆట పాటల యందు మక్కువ చూపేవారు గాదు. ఇంటిలో చిన్న పాపడుగుటచే తల్లి దండ్రులే గాక నాయనమ్మ కూడ స్వామీజీని ఎంతో ముద్దు మురిపాలతోను, అతి గారాబంగాను చూసే వారు.

అందరు అతిగారాబంగా చూచినా గానీ స్వామీజీకి ఒక్క దుర లవాటు కూడ లేక పోవటం ఒక విశేషమే. స్వామీజీ బాల్యం నుంచి శివుని యందత్యంత భక్తి శ్రద్ధలు చూపి సార్థక నామధేయులని నిరూ పించారు. స్వామీజీ ఇంటిలోని వారితో ప్రతినిత్యం దేవాలయానికేగి అక్కడ జరిగే అర్చన, భజన కార్యక్రమాలలో మనస్సు లగ్నం చేసి ఆ కార్యక్రమాలు ముగిసిన పిదపే ఇంటికి చేరేవారు. అంత చిరు ప్రాయం లోనే, ఆ దైవ కార్య క్రమాలవల్ల కలిగే ఫలితం ఏమిటో తెలియక పోయినా వాటియందే మనస్సు లగ్నం చేయటం సామాన్య విషయం గాదు.

స్వామీజీ బాల్యం నుంచి ముక్తసరిగా గడిపే వారు. ఎవరెన్ని ప్రశ్నలు వేసినా క్లుప్తంగా ఒక్క మాటలో సమాధాన మిచ్చేవారు. ఎక్కువ సమయం దేవతా మూర్తుల విగ్రహాలను, చిత్ర పటాలను చూస్తూ గడిపే వారు. ఒక్కొక్కసారి ఆకలి కూడ మర్చిపోయే వారు. పదిసార్లు పిలిచి పెడితే కొద్దిగా తినేవారు లేకపోతే అదీ లేదు. రాత్రు లందు అందరు నిదురించిన తరువాతనే భోజనం చేసేవారు.

స్వామీజీ ఏడవ సంవత్సరములో అక్షరాభ్యాసం చేయించి పాఠ శాలకు పంప నారంభించారు వారి తల్లి దండ్రులు. పాఠశాలలో సహ విద్యార్థుల ఆటపాటలు సహితం స్వామీజీ సహజమైన మిత భాషిత్వాన్ని మార్చలేక పోయాయి. పాఠ్యాంశాలయందు శ్రద్ధ చూపుటచే మంచి బాలుడని ఉపాధ్యాయులు మెచ్చుకొనేవారు.

స్వామీజీ పాఠశాలలో చదివే రోజుల్లో అప్పుడప్పుడు ఫుట్ బాలు ఆడేవారు. స్నేహితులతో కలిసి సైకిలు త్రొక్కటం నేర్చుకున్నారు. సైకిలు త్రొక్కటానికి ఇష్టపడేవారు.

ఒక పర్యాయం స్వామీజీ తన స్నేహితులతో సైకిలు మీద పొరుగు గ్రామానికి వెళ్ళి తిరిగి వస్తూండగా సైకిలు చెడిపోయింది. ఆ గ్రామనివాసి ఒకతను వాళ్ళందరికి భోజనం పెట్టి ఆ రాత్రికి వారందరిని తన దగ్గరనే ఉంచుకొని పిల్లల తల్లిదండ్రులు కంగారు పడతారని తలచి తన నౌకరుచే వారికి కబురుపంపి తెల్లవారిన తరువాత సైకిలు బాగు చేయించి పిల్లలందరికి పాలు, ఉపాహారము ఇచ్చి వారి గ్రామానికి పంపించారు.

స్వామీజీ ఈ సంఘటనను తమ మహాసమాధి వరకు మరువలేదు. ఈ సంఘటనను గుర్తుచేసుకొని ''**అప్పటి రోజులలో మానవుడు మానవతా ధర్మాలను తు.చ. తప్పక పాటించే వాడు, పరులకు సహాయ పడటమే తన పరమావధి అనుకొనేవాడు, కానీ ఈ రోజులలో ప్రతి మనిషి స్వార్థంతోనే జీవిస్తున్నాడు. ప్రక్క వారి గురించి పట్టించుకునే నాథుడేలేడు**'' అని మథన పడేవారు. ఈ సంఘటన స్వామీజీ జీవితాన్ని ఎంతో ప్రభావితం చేసింది. స్వామీజీ ఏనాడూ ఇతరులపైన ఆధారపడక పోగా కొన్ని సందర్భాలలో ఇతరులకు తమ చేతనైన సహాయం మరికొన్ని సందర్భాలలో తమ శక్తికి మించిన సహాయాన్ని కూడ అందించే వారు.

స్వామీజీ బాల్యంలోనే భక్త విజయము, భారత, భాగవత, రామాయణాది గ్రంథాలను పఠించే వారు. స్వామీజీ ఇంటిలోని వారు వీటిని నిత్య పారాయణము చేసేవారు.

స్వామీజీ వారి గృహానికి అతి సమీపమున గల శివానందాశ్రమానికి తరచు వెళ్ళేవారు. శ్రీ శివానంద స్వామీజీ మన స్వామికి గల దైవ భక్తిని గమనించి భారత, భాగవతాది గ్రంథాలను సులభశైలిలో వివరించేవారు. శ్రీ శివానంద స్వామీజీ మన స్వామీజీకి లెక్కలు, చిన్న చిన్న పజిల్సు నేర్పేవారు.

స్వామీజీ ఇంటి దగ్గరలో గల ఒక గుహలో షిరిడీ సాయిబాబా రాతి మీద కూర్చున్న చిత్రపటముండేది. కొంత మంది ఆ పటానికి నమస్కరించేవారు, మరికొంతమంది పూజలు గావించేవారు. ఆ చిత్ర పటం ఎవ్వరిదైనదీ తెలియక పోయినా మన స్వామీజీ ప్రతినిత్యం బాబాను దర్శించుకొని నమస్కరించేవారు.

స్వామీజీ 8వ తరగతి వరకు చదువు కొనసాగించి, ఆ చదువు కూడు,గుడ్డకు తప్ప ఆధ్యాత్మికతకు ఏమాత్రం సహకరించదని భావించి చదువుకు స్వస్తి వచనాలు పల్కింవారు. కాని ఇంట్లో పెద్దల పోరు పడలేక 1941వ సంవత్సరంలో మెట్రిక్ పరీక్ష వ్రాసారు. ఆ చదువు మీద శ్రద్ధ లేని స్వామీజీ పరీక్షలో ఉత్తీర్ణులు కాలేక పోయారు.

## భుక్తికొరకు :

భుక్తి లేనిదే ముక్తి లేదన్న సంగతి తెలుసుకున్న స్వామీజీ ఆ భుక్తి కొరకు తాను ఇతరులకు భారం కావటం ఇష్టంలేక ఉద్యోగాల వేట ప్రారంభించి అనేకానేక ఉద్యోగాలు చేసిన వైనం ఇప్పుడు మీముం దుంచుతాను.

జపాన్ దేశం మన దేశంలోగల అతి పెద్ద నగరాలపై బాంబులు దాడి చేయుచున్న రోజులలో మద్రాసు రాష్ట్ర హైకోర్టు రికార్డురూంని భద్రత కోసం మద్రాసు నుంచి కోయంబత్తూరుకు తరలించగా స్వామీ జీకి అందులో రికార్డురూం అసిస్టెంటుగా తాత్కాలిక ఉద్యోగం లభిం చింది. యుద్ధ విరమణానంతరము రికార్డురూంని తిరిగి మద్రాసుకు మార్చటంతో స్వామీజీని ఉద్యోగం నుంచి తొలగించారు.

అటు పిమ్మట ఒక పుస్తకాల దుకాణంలో నెలకు రూ. 5/- జీతం మీద పుస్తకాలు అమ్మే పనిలో చేరారు. స్వామీజీ పుస్తకాలు చద వటంలో చూపిన శ్రద్ధ పుస్తకాలు అమ్మటంలో చూపకపోయే సరికి ఆ షాపు యజమాని స్వామీజీని ఉద్యోగంలోనుంచి తీసివేసాడు.

ఈ ఉద్యోగం చేస్తున్న సమయంలో జరిగిన ఒక సంఘటన స్వామీజీ జీవితంపై ఎంతో ప్రభావాన్ని చూపింది. స్వామీజీ పుస్తకాల షాపులో పనిచేస్తున్న సమయంలో ఆ ప్రాంతమంతా భయంకరమైన ప్లేగు వ్యాధి వ్యాపించి అనేక ఎలుకలు, మనుష్యులు సహితం మరణించ సాగారు. స్వామీజీ పని చేస్తున్న దుకాణంలో ప్లేగు వ్యాధితో ఒక ఎలుక

చచ్చిపడింది. ఎవ్వరూ దాని దగ్గరకు కూడ పోవ సాహసించకపోతే, స్వామీజీ ఎందరు చెప్పినా వినక దానిని తీసుకుపోయి దహనం చేసారు. అదేరోజు సాయంకాలానికి స్వామీజీకి ప్లేగు సోకి విపరీతమైన జ్వరంతో నేత్రాలు ఎర్రబడినవి. ఇది గాంచిన దుకాణదారు భయపడి కుటుంబ సమేతంగా అక్కడకు ఎంతో దూరాన గల తన బంధువుల గ్రామా నికి వెళ్ళినాడు. మూడురోజులు స్వామీజీ స్పృహ లేకుండా పడి ఉండటం చూచి చుట్టు ప్రక్కల వారు స్వామీజీ మరణం తథ్యమను కొనగా అందరు చకితులయ్యే రీతిన ఏ మందులు వాడకుండ, ఏవిధ మైన వైద్య సదుపాయం లేకుండానే నాల్గవనాడు స్వామీజీ స్పృహలో నికి వచ్చి ఆ తరువాత రెండు, మూడు రోజులలోనే పూర్తి ఆరోగ్య వంతులైనారు. ప్రాణ భీతితో కుటుంబ సమేతంగా దూరప్రాంతాని కేగిన యజమాని కుమారుడు మరణించగా పుత్రశోకంతో స్వగ్రా మానికి తిరిగి వచ్చాడు. ఈ సంఘటనతో స్వామీజీకి జనన మరణా లపై సరియైన అవగాహన కలిగి "**దైవేచ్ఛ లేకుండా ఏమీ జరు గదు, మన లలాట లిఖితాన్ని ఎవ్వరూ మార్చలేరు, జన్మించిన ప్రతి ప్రాణి మరణించక తప్పదు, ఎంత దూరమేగినా మరణాన్ని దూరంగా ఉంచలేము**" అన్న నిర్ణయానికి వచ్చి తమ దైవ చింత నను మరింత దృఢ భక్తితో కొనసాగించ సాగారు.

పుస్తకాల షాపులో ఉద్యోగం పోయిన తరువాత స్వామీజీ విద్యు చ్ఛక్తి కార్యాలయంలో హెల్పరుగా రోజు వారి వేతనం మీద పనిచేయ సాగారు. ఉద్యోగరీత్యా స్వామీజీ గుంటలు త్రవ్వటం, స్తంభాలు పాతటం వంటి కష్టమైన పనులు చేయాలి. కానీ స్వామిజీ చదువుకున్న

వారవటం వల్లనూ, శరీర దారుఢ్యం లేని వారగుట వల్లనూ ఆయ
నకు పని వాళ్ళకు కావలసిన సామానులు ఇచ్చి వాటి లెక్కలను వ్రాసే
పని నప్పగించారు. పై అధికారులు తనిఖీకి వచ్చినపుడు స్వామీజీ వంటి
శరీర దారుఢ్యం లేని వారిని ఆ ఉద్యోగానికి ఎందుకు నియమించినదీ
వివరించ వలసి వస్తుందని స్వామీజీని పై అధికారుల కళ్ళ పడకుండా
దాచి పెట్టేవారు. కొన్ని సందర్భాలలో స్వామీజీని ఆఫీసు నుంచి
దూరంగా పంపించేవారు.

ఈ ఉద్యోగం చేస్తున్న కాలంలోనే స్వామీజీకి మాతృ వియోగం
సంభవించింది. ఈ జనన మరణాల విషయంలో సతమతమైన
స్వామీజీ ఇంట్లో ఎవ్వరికీ చెప్పక తమ స్వస్థలమైన కోయంబత్తూరుని
విడచి బొంబాయి మహానగరం చేరారు. స్వామీజీ జీవితంలో ఇది
రెండవ మలుపు.

స్వామీజీ 1944 లో నౌకా సిబ్బంది సమ్మె జరిగే సమయంలో
బొంబాయి మహానగరం చేరారు. నౌకాశ్రయంలో ఆంగ్లేయులకు
ఎక్కువ జీతాలు భారతీయులకు తక్కువ జీతాలు చెల్లిస్తున్నందు వల్ల
సర్దార్ వల్లభాయ్ పటేలు భారతీయ కార్మికులను సంఘటిత పరచి
సమాన వేతనాలకై పోరాడవలసిందిగా వారిని సమ్మెలోకి దించారు.
అగ్నికి ఆజ్యం పోసిన చందాన దీనికి తోడు బొంబాయి నగరం మత
కలహాలతో అట్టుడికి పోతూంది. ఆ సమయంలో బోరీబందర్ స్టేష
నులో రైలు దిగిన స్వామీజీ అక్కడ ఒక హిందూ యువకుడు అనేక
మంది ముసల్మానులతో తలబడుట చూచి ఏ మతంలోనూ ఇతర

మతస్తులను దూషించమని లేదు. మత సారాన్ని సరిగా అర్థం చేసుకో కుండా మతం పేరిట జరిపే మారణ హోమాన్నిగాంచి వికలిత మన స్సులో దైవంపైన భారంవేసి బొంబాయి మహానగరంలో కాలిడినారు.

ఆ మహానగరంలో బంధువులుగానీ పరిచయస్తులుగానీ ఎవ్వరూ లేక భాష తెలియక సతమతమవుతున్న స్వామీజీకి అదృష్ట వశాత్తూ ఒక తమిళ ముసల్మానుతో స్నేహ మేర్పడింది. ఆ ముస ల్మాను దయార్ద్ర హృదయుడు. స్వామీజీ పరిస్థితికి జాలిపడి స్వామీ జీకి సెంట్రల్ బొంబాయిలో గల తన నివాస గృహంలో ఆశ్రయమిచ్చి భోజన వసతికూడ కల్పించాడు. బాల్యం నుంచి సర్వమత సమాన త్వాన్ని మనసార నమ్మిన స్వామీజీ ఆ ముసల్మాను గృహంలో ఉండ టానికి ఏమాత్రం సంకోచించలేదు. ఆ పరిసర ప్రాంతమంతా ముస్లిం ములే అధికంగా ఉన్నా స్వామీజీ వారిలో ఒకరిగా కలిసి మెలసి ఉండే వారు. స్వామీజీకి ఆశ్రయం కల్పించిన ముసల్మాను స్వామీజీ తన బాల్య స్నేహితుడని చెప్పగా వారంతా స్వామీజీ సౌమ్యతను చూచి స్వామీజీని తమ ఆప్తునిగా చూసుకునే వారు. స్వామికి ఆశ్రయం కల్పించినతనికి బొంబాయి మున్సిపల్‌కు చీపురు కట్టలను సరఫరా చేసే కాంట్రాక్టు కలదు. కేరళ రాష్ట్రం నుంచి చీపురు పుల్లలను నావల ద్వారా బొంబా యికి తెప్పించి, కట్టలు కట్టి మున్సిపల్ వారికి సరఫరా చేసేవాడు. స్వామీజీ అతనికి భారం కాకుండా ఆశ్రయ మిచ్చిన వారికి ఋణపడి ఉండకూడదన్న ఉద్దేశ్యంతో చీపుళ్ళను కట్టేపనులలోనూ, వాటిని సరఫరా చేసి లెక్కలు వ్రాసే పనుల యందు అతనికి సహాయకారిగా ఉండే వారు. తాను అతనితోనే అతని గృహంలో నివసించటం అత

నికి అసౌకర్యంగా ఉంటుందని భావించి అతని అనుమతితో శలవు తీసుకొని ఉద్యోగాన్వేషణ ప్రారంభించారు మన స్వామీజీ.

ఎన్ని ప్రయత్నాలు చేసినా ఉద్యోగం దొరకక రోజుల తరబడి పస్తులుండే వారు. రాత్రి సమయాల్లో సముద్రపు ఒడ్డున కూర్చొని ధ్యానం చేసుకునే వారు. ఎట్టి పరిస్థితులలోనూ ఎవ్వరినీ యాచించే వారు కాదు. స్వామీజీ ప్రతి నిత్యం ఉదయమే స్నానం చేసి ముఖానికి విబూది రేఖలు వ్రాసుకొని దేవుని ప్రార్థించి ఉద్యోగాన్వేషణకు బయలు దేరేవారు.

ఒక అపరిచిత వ్యక్తి స్వామీజీ పరిస్థితికి జాలి పడి బీచ్ దగ్గర ఒకతను రొట్టెలు పంచుతున్నాడని అక్కడకు వెళ్ళమని చెప్పాడు. స్వామీజీ అక్కడకు వెళ్ళగానే రొట్టెలు పంచే ఫ్రాన్సిస్ డేవిడ్ స్వామి ముఖానికి గల విబూదిని చూచి ఏదైనా పని చేసుకోక ఎందుకు అడు క్కుంటున్నావని కసిరాడు. అతను హిందువులను హీనాతి హీనంగా దూషించాడు. అతని దూషణలను పట్టించుకోక శాంత స్వరంతో స్వామీజీ తాను అడుక్కోవటానికి రాలేదనియు పని దొరికితే చివరకు కూలి పని అయినా చేయటానికి సిద్ధమేనని చెప్పారు. మాటల సంద ర్భంలో స్వామీజీ తమిళులని గ్రహించిన డేవిడ్ తాను తంజావూరుకు చెందిన వాడినని హిందూ మతం విడిచి క్రిష్టియన్ మతం స్వీకరించి నట్లు చెప్పాడు. అటు పిమ్మట ఇద్దరు మంచి స్నేహితులయ్యారు. డేవిడ్ తాను వాచ్‌మెన్‌గా పనిచేస్తున్న కంపనీ యజమాని దగ్గరకు స్వామీ జీని తీసుకు వెళ్ళి ఏదైనా ఉద్యోగం ఇవ్వమని సిఫారసు చేయగా ఆ

కంపనీ యజమాని స్వామీజీకి ఉద్యోగం ఇవ్వడానికి నిరాకరించాడు. కంపనీ అభివృద్ధిలో భాగంగా నూతన భవనాల నిర్మాణతను గాంచిన స్వామీజీ కనీసం కూలిపని అయినా ఇప్పించమని ప్రాధేయపడగా ఆ యజమాని అందుకు కూడ అంగీకరించలేదు.

డేవిడ్ తనకు పరిచయమున్న ఒక హోటలు యజమానికి స్వామీజీకి ఏదైనా పని ఇప్పించమని సిఫారసు ఉత్తరం వ్రాసి స్వామిని పంపగా అతను కూడా వ్యాపారం సరిగా జరగటం లేదని ఉద్యోగం ఇవ్వటం సాధ్యం కాదని చెప్పాడు. స్వామీజీ మంచి నైజాన్ని గుర్తించిన డేవిడ్ స్వామికి తన గదిలో ఆశ్రయం కల్పించాడు.

ఎట్టకేలకు స్వామీజీ కష్టాలు గట్టెక్కి '**ప్రోగ్రసివ్ మెడికల్స్**' అనే డి.డి.టి. తయారు చేసే కంపనీలో తాత్కాలిక ఉద్యోగం లభించింది. ఆ కంపనీలో స్వామీజీ సీసాలు కడిగి శుభ్రపరచుట, పార్సిలు మీద చిరునామాలు వ్రాయాటం మొదలగు పనులు చేసేవారు. కొంత కాలం పనిచేసిన తరువాత తాత్కాలిక ఉద్యోగం కావటంతో కంపనీ యజమాని స్వామీజీని ఉద్యోగంలోంచి తీసివేసాడు.

స్వామీజీ ప్రతినిత్యం పేపరు చదివి అందులో ప్రకటించిన ఉద్యోగాల ఇంటర్వ్యూలకు హాజరయ్యేవారు. ఎటువంటి ఉద్యోగం చేయటానికైనా వెనుకంజ వేసేవారు కాదు.

ఇంటింటికి పాలు సరఫరా చేసే ఉద్యోగానికి పాలు సరఫరా చేసే అతని దగ్గరకు వెళ్ళి ఇళ్ళ చిరునామాలు సరిగా తెలియని స్వామి

ఆ ఇంటర్వ్యూలో కృతార్థులు కాలేక పోయారు.

ఉద్యోగం లభించక తలదాచుకోవటానికి నీడ, తినటానికి తిండి లేక పోయినా దైవం మీద విశ్వాసం కించిత్తు కూడ సడలలేదు మన స్వామీజీకి. రొట్టెలిని టీ త్రాగి రోజులు గడిపేవారు. వాటికి కూడ డబ్బులేని రోజున నీళ్ళు మాత్రం త్రాగి రోజులు గడిపిన వైనం మన స్వామీజీ జీవితంలో ఎన్నో ఉన్నాయి.

## గురుకృప :

ఈ పరిస్థితులలోనే స్వామీజీకి ఒక గొప్ప దైవ భక్తుడు, శాస్త్రాల సారాన్ని ఔపోసన పట్టిన ఒక మహోన్నత వ్యక్తితో చిత్రంగా పరిచయ మేర్పడింది. స్వామీజీ వారినే తన గురువుగా స్వీకరించి వారినుంచి అనేక గ్రంథసారాలను గ్రోలి తన జీవిత గమ్యాన్ని భగవంతుని నిర్ణ యానికి వదిలి వేసారు. భక్తుని దగ్గరకు భగవంతుడు వచ్చినట్లు మంచి శిష్యుని కోసం గురువే శిష్యుని దగ్గరకు వచ్చారు. మంచి శిష్యుని కోసం గురువే శిష్యుని వెతుక్కుంటూ వస్తారన్న నానుడి అక్షర సత్యమైంది మన స్వామీజీ విషయంలో. స్వామీజీ గురువుగారి నామధేయం శ్రీ ముత్తయ్య గారు. వీరి స్వగ్రామం మద్రాసు రాష్ట్రంలోని తిరున ల్వేలి జిల్లాలోని వల్లనాడు. ఒక పర్యాయం శ్రీ ముత్తయ్య గారు ఆధ్యా త్మిక పరమైన సందేహ నివృత్తి కోసం ఒక దేవాలయానికి వెళ్ళగా అక్కడ మన స్వామీజీ చేతిలో గల '**జీవ బ్రహ్మైక్య రాజయోగ సారాం శము**' అను తమిళ గ్రంథాన్ని చూచి స్వామికి తనను తాను పరిచయం చేసుకుని ఆ గ్రంథాన్ని తెరచి చూడగ తన సందేహానికి సమాధానం

తెరిచిన పుటలోనే లభించింది. వీరివురి కలయిక ఎంత చిత్రమైనదో ఎంత శుభసూచక మైనదో పాఠకులు గ్రహింతురు గాక. రాను రాను వీరి పరిచయం వృద్ధి చెంది శ్రీ ముత్తయ్య గారి జ్ఞాన సంపన్నతకు అచ్చెరువొందిన స్వామీజీ వారినే తన గురువుగా స్వీకరించారు.

శ్రీ ముత్తయ్య గారి అతి నిరాడంబరత, విద్యా వివేకములున్నను అణకువతో ఉండుట, దైవ చింతన మన స్వామీజీ జీవితంపై ఎంతో ప్రభావితం చేసినవి. మన స్వామీజీ కూడ గురువుకు తగ్గ శిష్యుడై ఆయన అడుగు జాడలలోనే నడిచి ఆయన వలెనే బ్రహ్మచర్యాన్ని పాటించి భగవంతుని సేవకే తన జీవితాన్నర్పించిన ధన్యజీవి.

శ్రీ ముత్తయ్య గారు బొంబాయిలో ఒక నూలు మిల్లులో పని చేసేవారు. వీరు పగలంతా కష్టపడి పనిచేసి రాత్రి 11గంటలకు ఇంటికి వచ్చి వంట చేసుకొని భోజనం చేసి ఆ తరువాత తెల్లవారు ఝాము వరకు ధ్యానంలో గడిపే వారు. రోజులో 2 లేక 3గంటలు మాత్రమే నిదురించేవారు. గురువు గారి అడుగుజాడలలో నడిచిన మన స్వామీజీ కూడ అతి స్వల్ప సమాయాన్ని నిదురకు కేటాయించేవారు. తమ జీవితాంతము వరకు స్వామీజీ ఈ నియమాన్ని ఉల్లంఘించ లేదు.

స్వామీజీ వారి గురువు గారింటికి ప్రథమంగా వెళ్ళినప్పుడు ఆయన నివసించే గది, ఆ పరిసర ప్రాంత వాతావరణం చూసి ఆశ్చర్య చకితులయ్యారు. గదిలో రెండు, మూడు పాత్రలు కొద్దిగా వంట సామాను, రెండు జతల బట్టలు మాత్రం ఉన్నాయి. ఆ ప్రాంతమంతా

చెత్తాచెదారంతోటి, మురికి నీటితోను, కడు బీదవారు నివసించే కాలనీ అది. అందు నివసించే వారంతా పగలంతా కష్టించి పనిచేసి ఆ కష్టాన్ని మర్చి పోవటానికి తప్పత్రాగి సాయంకాలానికి గూటికి చేరే అభాగ్యులు. శ్రీ ముత్తయ్య గారు అటువంటి మురికి వాడలో నివసిస్తున్నా ధ్యానానికి గానీ, పూజ పునస్కారాలకు గానీ ఆ కలుషిత వాతావరణం వారి నిత్యకృత్యాలకు ఏమాత్రం ఆటంకం కాలేదు. అటువంటి ప్రదేశంలో నివసిస్తూ దైవ ధ్యానం ఎలా కొనసాగిస్తున్నారన్న మన స్వామీజీ ప్రశ్నకు శ్రీ ముత్తయ్య గారిచ్చిన సమాధానం వింటే మనకందకరికీ కనువిప్పు కలుగుతుంది. శ్రీ ముత్తయ్య గారు తాను ఇంటికి చేరుకొనే సరికి రాత్రి 11 గంటలు అవుతుందనీ, అప్పటికి త్రాగుబోతుల హడావుడి సద్దుమణుగుతుందనీ, మనస్సు నాధీనంలో ఉంచుకొని ధ్యాన గ్రస్తులైతే ప్రక్కన పిడుగు పడినా చలించ కూడదనియు అట్టి ఏకాగ్రత అవసరమని సెలవిచ్చారు. ఆ చుట్టు ప్రక్కల చెత్తా చెదారం గురించి వివరిస్తూ మురికి ఎక్కడ లేదు, మన శరీరంలో సహితం మల మూత్రాదులు, రక్త మాంసాలున్నాయి వాటిని మనం శుభ్రం చేయగలమా అని ఎదురు ప్రశ్నించి మనస్సు మలినం కాకుండా చుసుకోవాలి అదే జీవిత పరమావధని వచించారు. ఈ ఉపదేశమే స్వామీజీకి తారక మంత్రం వలె పనిచేసి ఆయన జీవితాన్ని పరమార్థం వైపు పయనించే టట్లు చేసింది.

శ్రీ ఫ్రాన్సిస్ డేవిడ్ మన స్వామీజీకి ధ్యానం చేసుకొనే టప్పుడు కూర్చునటానికి ఒక టవలు, **'సీక్రెట్స్ ఆఫ్ వేదాంత'** అనే గ్రంథాన్ని బహూకరించారు. ఒక రోజు స్వామీజీ ఆ టవలు మీద కూర్చుని

ధ్యానం చేస్తుండగా డేవిడ్ మత్తుపదార్థాలు సేవిస్తున్నట్లు అనుభూతి కలిగి డేవిడ్‌ను ప్రశ్నించగా అతను నిజమేనని అంగీకరించారు.

మరొక పర్యాయం స్వామీజీకి స్వప్నంలో మేడ మెట్ల మీద పైభాగాన స్వామీజీ మధ్యన డేవిడ్ క్రింది భాగాన పచ్చని చీర ధరించిన స్త్రీగల దృశ్యం కనిపించింది. ఆ స్వప్నంలో స్వామీజీ డేవిడ్‌ను పైకి లాగుతుండగా ఆ స్త్రీ అతనిని క్రింది వైపుకు లాగుతున్నది. కొంత కాలం తరువాత స్వామీజీ డేవిడ్ ఇంటికి వెళ్ళగా స్వామీజీ స్వప్నంలో కనిపించిన స్త్రీని అక్కడ చూచి ఆశ్చర్య చకితులయ్యారు. అంతలోనే డేవిడ్ వచ్చి ఆమె తన భార్యని స్వామికి పరిచయం చేసాడు. ఈ స్వప్న దృశ్యాన్ని బట్టి స్వామీజీ డేవిడ్‌ను ఉచ్ఛస్థితికి తీసుకు వెళ్ళటానికి ప్రయత్నిస్తుండగా అతని భార్య అతనిని సంసార సాగరంలోనికి లాగుతున్నట్లు స్పష్ట మవుతుంది.

స్వామీజీ ఒక రోజు డేవిడ్ ను తమ గురువు గార్కి పరిచయం చేయగా ఆ తరువాత శ్రీ ముత్తయ్య గారు స్వామీజీతో అతని వ్యక్తిత్వం మంచిది కాదని చెప్పగా స్వామీజీ డేవిడ్‌కు దూరంగా మెదలసాగారు.

స్వామీజీ ఏవిధమైన ఉద్యోగం లేక ఇబ్బంది పడుతుంటే శ్రీ ముత్తయ్య గారు స్వామిని చేరదీసి తమ ఇంట్లోనే బస, భోజన సదుపాయాలు సమకూర్చారు. ఎప్పుడూ కష్టించి పనిచేసే స్వామీజీ, ఇతరులకు భారం కాకూడదనుకొని గురువుగారింట్లో తిని కూర్చోవటం ఇష్టం లేక వంట వండటం గురువు గారి బట్టలు ఉతకటం మొదలగు పనులు చేసేవారు. ఏ పని చేస్తున్నా దైవనామస్మరణాన్ని మనస్సులోనే

మననం చేసుకొంటూ మనస్సును దైవం మీదనే లగ్నం చేసేవారు మన స్వామీజీ. వంట చేసేటప్పుడు సహితం గరిటను '**ఓం**' ఆకారంలో త్రిప్పుతూ వంటకాలను కలియ పెట్టేవారు. స్వామీజీకి వంట చేయటం రాకపోయినా గాని ఈ ప్రక్రియ వల్ల వంట ఎంతో రుచిగా కుదిరేది. గురువుగారు సహితం స్వామీజీ చేతి వంటకాన్ని మెచ్చుకునేవారు.

స్వామీజీ వారి గురువు గారి పైన ఆర్థిక భారాన్ని మోపటానికి ఇష్టపడక వారికి ఆర్థికంగా చేదోడువాదోడుగా నిలవాలని తలచి మాతుంగ పోస్టు ఆఫీసు దగ్గర ఫుట్ పాత్ మీద కూర్చొని అక్కడకు వచ్చే చదువు రాని వారికి యం.ఓ.లు నింపటం, ఉత్తరాలు వ్రాయటం లాంటి పనులు చేసి వారిచ్చినది స్వీకరించేవారు. '**ఇంతివ్వమని**' నిర్బంధించే వారుకాదు. ఆ విధంగా సంపాదించిన డబ్బును గురువు గారికి సమర్పించే వారు. ఆ పోస్టు ఆఫీసుకు ఎక్కువగా ఉత్తర ప్రదేశ్ నుంచి వలస వచ్చిన '**భయ్యా**' లనే నిరక్షరాస్యులు వచ్చేవారు. వీరు బొంబాయిలోని కర్మాగారాల్లో కూలి పనిచేస్తూ జీవనాన్ని సాగించే వారు. వీరి అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకుని వీరిని అందరూ మోసం చేసేవారు. సత్యాన్ని, న్యాయాన్ని నమ్ముకొని జీవనం సాగి స్తున్న మన స్వామీజీ వీరికి జరుగుతున్న అన్యాయాన్ని వారికి వివరించి ఆ మోసగాళ్ళతో తగవు పడటం ఇష్టం లేక ఆ ప్రదేశాన్ని విడనాడారు.

స్వామీజీ పరిస్థితి మళ్ళీ మొదటికి వచ్చింది. ఆ తరువాత అతి కష్టం మీద '**శాంతి కాటన్ అండ్ సింథటిక్**' మిల్లులో దిన భత్యం మీద కూలిపని సంపాదించుకున్నారు. ఆ మిల్లులో స్వామీజీ మూడవ

షిఫ్టు (అర్ధరాత్రి నుంచి తెల్లవారే వరకు) లో పని చేసేవారు.స్వామీజీ ఒక చిన్న గదిని అద్దెకు తీసుకొని అందులో నివసించ సాగారు. ప్రతి నిత్యం ఉదయమే గురువుగారిని దర్శించుకొని వారి ఆశీర్వాదాన్ని తీసు కొని ఆధ్యాత్మిక రంగానికి చెందిన అనేక విషయాలను నేర్చుకొనే వారు.ఆ ఉద్యోగం చేస్తున్న సమయంలోనే స్వామీజీకి సునీల్ అనే బెంగాలీ వ్యక్తితో పరిచయ మేర్పడింది. సునీల్ ఏ ఉద్యోగం లేక బాధ పడుతుంటే అతని పరిస్థితికి జాలిపడి అతనిని తనతోనే ఉంచుకొని అన్ని సౌకర్యాలు ఏర్పరచి అతని భారాన్ని తన మీద వేసుకున్నారు స్వామీజీ. సునీల్ కుమార్ స్వామీజీ ఇచ్చిన డబ్బుతో తిని తిరిగేవాడు. తన జీవనోపాధి కొరకు ఉద్యోగ ప్రయత్నం కూడా చేయక పోవటమే గాక చుట్టు ప్రక్కలవారితో అసభ్యంగా ప్రవర్తించేవాడు. ఇతని సోమ రితన్నాని అసభ్య ప్రవర్తనను చుట్టు ప్రక్కలవారంతా స్వామీజీ దృష్టికి తీసుకెళ్ళగా అతను కష్టాలలో ఉన్నాడు అతనిని ఆదుకోవటం తన బాధ్యత అని వారందరిని ఒప్పించారు. సునీల్‌కుమార్ ముసల్మానని అతని నామధేయం హుస్సేన్ అని తెలుసుకొని చుట్టుప్రక్కల వారు నిలదీయగా అతను స్వామీజీకి చెప్పకుండా ఆ ప్రాంతం వదిలి పారిపో యాడు. కానీ సునీల్ కుమార్ చర్య స్వామీజీని కృంగదీసింది. దానికి కారణం అతను ఏ మతస్థుడన్నది గాదు, ఉద్యోగం లేని అతను ఇంకెన్ని కష్టాల ననుభవించాలోనని మాత్రమే. అతను అసత్యాలు చెప్పి పేరుని మతాన్ని సహితం మార్చుకొని స్వామీజీ వద్ద ఆశ్రయం సంపాదించినా స్వామీజీ అతని మీద ఆగ్రహం చూపకపోగా అతని మీద కరుణ చూపించారంటే స్వామీజీ ఎంతటి దయార్ద్ర హృదయులో తేట తెల్ల మవుతుంది.

స్వామీజీ పనిచేసే శాంతి మిల్లులో అగ్ని ప్రమాదం సంభవించగా అందులో పని చేసే తాత్కాలిక ఉద్యోగు లందరినీ పనిలోంచి తొలగించారు. స్వామీజీ ఒకరి దయాదాక్షిణ్యాల మీద ఆధార పడరని తెలిసిన శ్రీ ముత్తయ్య గారు స్వామీజీకి కొంత పైకం ఇచ్చి ఏదైనా వ్యాపారం చేసి భుక్తి గడుపుకోమనగా ఆ పైకంతో స్వామీజీ టోకు మార్కెట్టులో అరటి పళ్ళను కొని గంపలో నెత్తిన పెట్టుకొని ఇంటింటికి తిరిగి అమ్మేవారు. వ్యాపార సరళి తెలియని స్వామీజీ లాభాలు సంపాదింపక పోగా గురువు గారు పెట్టిన పెట్టుబడిని సహితం హరింపజేసారు. ఇది చూసిన శ్రీ ముత్తయ్య గారు స్వామీజీ వ్యాపారానికి పనికి రారని ఇక ముందు కూడా వ్యాపారం చేయవద్దని స్వామిని ఆదేశించారు. గురువుగారి ఆదేశాన్ని పాటించిన స్వామీజీ తమజీవితంలో మరల ఏ వ్యాపారమూ చేయలేదు.

గురువుగారికి కల్గిన నష్టాన్ని భర్తీ చేయాలన్న తలంపుతో స్వామీజీ సియాన్ రైల్వే స్టేషనులో కూలిగా పని చేసి ఆ సంపాదనను గురువుగారికి సమర్పించే వారు. స్వామీజీ నిజాయితీకి, కార్య దీక్షతకు ముగ్ధులైన శ్రీ ముత్తయ్య గారు స్వామికి తన వద్దనే ఆశ్రయం కల్పించారు. ప్రయాణీకుల సామాను మోసి ఇంతివ్వమని అడిగేవారుకాదు. వారిచ్చిన దానితోనే సంతోషపడేవారు. మిగతా అందరి కూలీల కంటే తక్కువ కూలీ తీసుకొనే వారు. స్వామీజీ అమాయకత్వానికి ఇతర కూలీలు హేళన చేసినా స్వామీజీ బాధపడేవారు కాదు.

మానవ జన్మ యొక్క పరమార్థాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకొన్న స్వామీజీ ఎల్లప్పుడు ఇతరులకు ఏ విధంగా సహాయ పడగ లనా అని తపన చెందేవారు. ప్రతి మానవుడు ఇదే విధంగా ఆలోచిస్తే ఇప్పుడు జరిగే కుట్రలు, కుతంత్రాలు, హింసాత్మక చర్యలకు తావు లేక ఈ భువి దివి కంటే మిన్నగా ఉండును గదా! సియాన్ రైల్వే స్టేషను ప్రక్కన ఒక చిన్న వ్యాపారి త్రోపుడు బండి మీద అద్దాలు, దువ్వెనలు, పర్సులు మొదలగు చిన్న చిన్న వస్తువులను అమ్ముకొని జీవనాన్ని సాగిం చేవాడు. మధ్యాహ్నా సమయంలో అతను భోజనానికి ఇంటికి వెళ్ళిన ప్పుడు నిజాయితీ పరుడు, పరుల సొమ్ముకై ఆశ పడని మన స్వామీ జీకి బండి అప్పగించి వెళ్ళేవాడు. అతను భోజనం చేసి వచ్చిన తరు వాత స్వామీజీ అప్పటి వరకు అమ్మకాల మీద వచ్చిన డబ్బులు, సామా నులు సరిగా లెక్కచెప్పి అతనికి అప్పగించే వారు. తనపని మానుకొని సహాయం చేస్తున్న స్వామికి అతను ప్రతి నిత్యం టీ ఇప్పించే వాడు. ఇద్దరు ఆత్మీయతతో కలిసి మెలిసి ఉండేవారు.

ఇదే సమయంలో శ్రీ ముత్తయ్య గారు షుమారు ఆరు మాస ముల పాటు తమ స్వగ్రామం వెళ్ళారు. ఆయన తరిగి వచ్చే సరికి స్వామీజీ చిక్కి శల్య మవగా ముత్తయ్య గారు దీనికి కారణం అడుగగా తన సంపాదన భోజనానికి చాలక పోవటంతో బన్ తిని, టీ త్రాగి గడిపినట్లు సమాధాన మిచ్చారు స్వామీజీ. ఇంట్లో వంట సామాను లన్నీ ఉండగ ఎందుకు వంట చేసుకోలేదని ప్రశ్నించగా స్వామీజీ ''**అవి మీ సామానులు మీరు లేని సమయంలో వాటిని నేను వాడు కుంటే అది చోరత్వమే**'' నని తాను ఆ సామాను వాడుకోలేదని

సమాధాన మిచ్చారు. ఈ సమాధానం విన్న శ్రీ ముత్తయ్య గారు ప్రతి వ్యక్తి పైసల కోసం ప్రాకులాడుతుంటే, పరుల సొత్తుని కన్నెత్తి చూడని ఇతను కారణ జన్ముడని నిర్ధారించుకొని, స్వామితో '**నీవు నమ్మిన ఈ సిద్ధాంతాన్ని ఏనాడూ విడువకు అదే నీకు శ్రీరామరక్ష**' అని ఆశీర్వదించి ఆర్తితో ఆలింగనం చేసుకొన్నారు. జీవితాంతం వరకు గురువాజ్ఞను త్రికరణ శుద్ధిగా పాటించి తనకు ఎంత దక్షిణ వచ్చినా గానీ రేపటి కోసం పదిల పర్చుకోకుండా దక్షిణ ధనా న్నంతా సత్కార్యాలకే వినియోగించిన ధన్యజీవిమన స్వామీజీ. ఇటు వంటి సుగుణాలగని తన శిష్యుడిగా లభించినందుకు వారిని కన్న తల్లి దండ్రులకు తన శిష్యునిగా చేసిన దైవానికి కృతజ్ఞతలు తెల్పుకునేవారు ముత్తయ్య గారు.

స్వామీజీకి గురువు యందు అత్యంత శ్రద్ధా భక్తులుండ బట్టే ఆయన జీవితంలో అధిక భాగం సద్గురువులకే సద్గురువైన సాయి సన్ని ధిలో గడప గలిగారు. గురువుని త్రిమూర్తి స్వరూపుడని నమ్మటం వల్లనే తమ ఏడు దశాబ్దాల జీవిత కాలంలో నాలుగున్నర దశాబ్దాలు స్వామి సేవలందుకున్నారు షిరిడీ సాయిబాబా. గురువునే విధంగా సేవిం చాలో స్వామీజీ జీవితమే ఒక ఉదాహరణ. స్వామిజీని చాలమంది గౌర వపూర్వకంగా ''**గురుదేవ్**'' అని సంబోధించేవారు.

సియాన్ రైల్వే స్టేషను ప్రక్కనే ఒక బీదకుటుంబానికి చెందిన 16సంవత్సరముల యువతి కూలి చేసుకుంటూ నివసించేది. ఆమె చూడచక్కని అందగత్తె. ఆమె అందానికి అందరు ఆకర్షితులయ్యే

వారు. ఆమెతో ఏదోసాకుతో మాట్లాడటానికి ప్రయత్నించే వారు కొందరైతే కళ్ళతోనే ఆమె అందాన్ని ఆస్వాదించేవారు మరి కొందరు. ఆ యువతి మాత్రం వీరిని పట్టించు కోకుండా తనపని తాను చేసుకు పోయేది. కొంత కాలం తరువాత ఆమెకు మసూచి సోకి అంద విహీనంగా తయారై ముఖమంతా మచ్చలు పడటమే గాక చూపు కూడా పోయి అంధురాలైంది. అప్పటి వరకు ఆమె అందచందాలకు ముగ్ధులై ఆమె తమతో ఒక్కసారి మాట్లాడితేనే భాగ్యమనుకున్న వారు ఆమె నుంచి తప్పించుకొని దూరంగా తిరగ సాగారు. ఆమె తల్లి దండ్రులు సహితం ఆమెను ఇంటినుంచి తరిమి వేసారు. బ్రతుకు తెరువుకోసం చివరకామె బిచ్చగత్తెగా మారింది. ఒకప్పుడు ఆమెను దేవకన్యతో పోల్చి పొగడిన వారే ఆమె అందం హరించుకు పోగానే చీదరించుకోసాగారు. ఇదంతా చూసిన స్వామీజీ వికలిత మనస్కులై ఈ విషయమే పదే పదే ఆలోచించి బాహ్యసౌందర్యము శాశ్వతము కాదనియు అంతః సౌందర్యమే శాశ్వతమైనదని ఈ మానవ శరీరము అనేక పరిణామాలు చెంది చివరకు బూడిదవుతుందనియు, పది మందికి మంచి చేసే వారి హృదయంలో స్థానం సంపాదించుకోవటమే శాశ్వతమైనదని భావించి తనకు చేతనైనంత వరకు నలుగుకి సహాయపడేవారు మన పూజ్య శ్రీ శివనేశన్ స్వామీజీ.

స్వామీజీ పగలంతా కూలీ పనిచేసి సాయంత్రానికి ఇంటికి చేరి గురువువచ్చే సమయానికి వంట చేసి గురువుగారు భోజనం చేసిన తరువాతనే స్వామీజీ భోజనం చేసేవారు.

ఏ మాత్రం తీరిక చిక్కినా భారత, భాగవత, రామాయణాది పురాణ గ్రంథాలను శ్రద్ధగా చదివి ఆకళింపు చేసుకునే వారు. వారికే మైనా సందేహాలు కలిగితే గురువుగారి నడిగి సందేహ నివృత్తి చేసుకు నేవారు. గురువుగారి సలహా మీద స్వామీజీకి సమయం చిక్కినపుడల్లా ధ్యానం చేసుకొంటూ సమయాన్ని సద్వినియోగం చేసుకునే వారు. రాత్రి సమయాల్లో సముద్ర తీరాన ప్రశాంతమైన వాతావరణంలో ధ్యానం చేసుకునే వారు.

నిత్యానంద స్వామి దర్శనార్థం బొంబాయి నుండి గణేష్ పురికి కాలినడకన వెళ్ళారు మన స్వామీజీ. మఠంలో కుండం దగ్గర కాళ్ళు కడుక్కొని ఆశ్రమంలోనికి ప్రవేశిస్తూండగా నిత్యానంద స్వామీజీ మన స్వామికి ఎదురు వచ్చారు. స్వామీజీ ఆశ్రమంలోనికి వెళ్ళి చూడగా అక్కడ నిత్యానంద స్వామీజీ పీఠం మీద ఆసీనులై ఉన్నారు. ఒకే సమ యంలో ఒకే మనిషి రెండు వేర్వేరు ప్రదేశాలలో ఎలా దర్శన మిచ్చింది స్వామికి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆశ్రమంలోని ప్రశాంత వాతావ రణం నచ్చిన స్వామీజీ కొన్ని దినాలు అక్కడే గడిపారు. స్వామీజీ తిరిగి బయలు దేరే రోజు నిత్యానంద స్వామీజీ ఒక నారికేళ ఫలాన్ని ప్రసా దంగా ఇచ్చారు. స్వామీజీ ఆయనకు సాష్టాంగా నమస్కారమొనరించి ఆశీర్వదించమని ప్రార్థించగా ఆయన ''**ఆశీర్వాదము ఉండబట్టే కదా నీకు నారికేళాన్ని ఇచ్చినది**'' అని సెలవిచ్చారు.

సియాన్ రైల్వే స్టేషన్ లో పనిచేసే రోజుల్లో స్వామీజీకి ఒక సారి స్వప్నంలో ఫకీరు వేష ధారి అయిన ఒక సాధువు దర్శన మిచ్చి

**'షిరిడీకిరా'** అని చెప్పారు. స్వామి దానిని గురించి ఎక్కువ ఆలో చించక మామూలు స్వప్నమని సరిపెట్టుకున్నారు. తరువాత మరి కొన్ని రోజులకు స్వప్నంలో కనిపించి **''నీవు త్వరగా షిరిడీకిరా''** అని ఆజ్ఞాపించారు. స్వామీజీ వారి గురువుగారికి స్వప్న వృత్తాంతాన్ని వివరించి షిరిడీ వెళ్ళుటకు అనుమతి గైకొని షిరిడీ బయలుదేరారు.

షిరిడీ ఎక్కడ ఉన్నదో ఏదారిని వెళ్ళాలో ఏమి తెలియని స్వామీజీ చేతిలో చిల్లిగవ్వలేక పోయినా **''రమ్మన్నది బాబా, పిలి చిన వాడు దరిచేర్చుకోడా''** అని భారమంతా బాబా పై మోపి రైలు పట్టాల వెంబడి కాలి నడకన షిరిడీకి బయలు దేరారు. దారిలో గల చిన్న చిన్న పల్లెలలో నివసించే వారు స్వామీజీ అడుగకుండానే రొట్టె లు, టీ, భోజనము సమర్పించారు. వాటితో క్షుద్బాధను తీర్చుకొని రెండు రోజులు నడక సాగించారు. మూడవరోజు స్వామీజీకి తినడా నికి ఏమీ లభించలేదు. ఆసాయంత్రానికి స్వామీజీ బాగా నీరసించి నడక సాగించడానికి శక్తిలేక పోయింది. **''నా భక్తుని యింట్లో 'లేమి' అన్న శబ్దమే పొడ చూపదు''** అని అభయ మిచ్చిన సాయి తన ఆజ్ఞ మేరకు తన సేవకై షిరిడీ వస్తున్న స్వామిని పస్తులుంచుతారా! అని ఏ భక్తునికైనా సంశయం కలుగవచ్చు. కానీ ఇచ్చట జరిగిన చిత్రాతి చిత్రమైన సాయిలీలను గాంచినచో సాయి తన భక్తులను ఏ విధంగా ఆదుకుంటారో అర్థమవుతుంది. నీరసించిన స్వామీజీ అడుగులో అడుగు వేసుకుంటూ మెల్లగా నడుస్తుండగా ఒక రైలు స్వామీజీని దాటి వెళ్ళే సమయంలో రైలులో ప్రయాణించే ఒక ప్రయాణీకుడు పూరీ, కూర గల అల్పాహార పొట్లాన్ని స్వామీజీ మీదకు విసిరాడు. దానిని

సాయినాథుడు ప్రసాదించిన ప్రసాదంగా భావించి, భుజించి ఆకలి తీర్చుకుని నడుస్తూ చీకటి పడే సమయానికి ఒక రైలు క్రాసింగ్ గేటు వద్దకు చేరుకున్నారు. ఆ గేటు కాపలాదారు రాత్రి వేళ యందు ఎక్కడికి ప్రయాణం చేస్తున్నది తెలుసుకొని ఆ ప్రాంతంలో గొడవలు ఉన్నవని పోలీసులు అనుమానిస్తే జైలులో పెడతారని ఆ రాత్రికి స్వామిని తనతోనే ఉంచుకుని భోజన సదుపాయాలు కల్పించి తెల్లవారిన తరువాత స్టేషను మాస్టరుతో చెప్పి కరజాక్ స్టేషను నుంచి టిక్కెట్టు లేకుండా రైలులో పంపే ఏర్పాటు చేసారు. అక్కల్ కోట మహరాజును దర్శించిన ఒక భక్తుడు స్వామికి రెండు అణాలు మరియు టీ ఇచ్చి షిరిడీ వెళ్ళమన్నాడు. స్వామి మార్గ మధ్యంలో దభోల్కారు, చందోర్కారుల గృహాలు దర్శించి నాసిక్ చేరుకున్నారు.

నాసిక్ లో రైలు దిగిన స్వామీజీ షిరిడీ చేరాలని ప్రయాణం సాగించి దారితప్పి త్రయంబకేశ్వరం చేరుకున్నారు. ఇది స్వా[illegible] జీవితంలో మూడవ మజిలీ. త్రయంబకేశ్వరంలో మౌని బాబా ఆశ్రమం కలదని తెలుసుకున్న స్వామి మౌని బాబాను దర్శించుకుని కొన్ని నెలలు ఆ ఆశ్రమంలోనే గడిపారు. స్వామీజీ గుణగణాలను పరీక్షించి ఆయన భక్తి శ్రద్ధలకు మెచ్చి మౌని బాబా స్వామిని ఆదరంగాను, ఆప్యాయంగాను చూసుకునే వారు. ఆశ్రమ ప్రాంతమంతా అరణ్యం కావటంతో ఏనుగులు, అడవిపందులు, ఎలుగుబంట్లు, జింకలు, లేళ్ళు మొదలగు జంతువులు ఆశ్రమ ప్రాంతంలో స్వేచ్ఛగా తిరుగు తుండేవి. అహల్య గుహ దగ్గర పులులు తిరగటాన్ని మౌని బాబా మన స్వామీజీకి అతి దగ్గర నుంచి చూపించారు. మౌని బాబా

ఒకరోజు స్వామిని గ్రామంలోనికి వెళ్ళి భిక్షచేసుకుని రమ్మనగా స్వామీజీ తనకు భిక్ష చేయుటం అలవాటు లేదని చెప్పగా బ్రహ్మచారులు భిక్షచేయుటంలో తప్పులేదని, వారికి భిక్ష నొసంగుట గృహస్థుల ధర్మమని నచ్చచెప్పి భిక్షకు పంపించారు. సహజంగానే బిడియస్థులైన మన స్వామీజీ ప్రతి గృహము దగ్గర అతి మెల్లగా ''భిక్షాందేహి'' అని ఆ ఇంటి ఇల్లాలికి కూడా వినీవినపడనంత మెల్లగా అనగా ఆరోజు అతి తక్కువ భిక్ష లభించగా అటు పిమ్మట మౌనిబాబాయే భిక్ష తెచ్చి స్వామిని కూడా పోషించారు. దీనిని బట్టి ఆయనకు స్వామిపై ఎంతటి ఆదరాభిమానాలు ఉన్నాయో చదువరులు గ్రహింతురుగాక!

ఒక రోజు స్వామికి స్వప్నంలో లంగోటి కట్టుకున్న ఒక వ్యక్తి దర్శన మిచ్చి ''**నిన్ను షిరిడీకి రమ్మంటే ఇక్కడ ఎందుకు ఉన్నావు?**'' అని గద్దించి ప్రశ్నించాడు. ఆ మరునాడే తాను షిరిడీకి వెళ్ళడానికి అనుజ్ఞ ఇవ్వమని మౌని బాబాను వేడుకొనగా స్వామీజీని దూరం చేసుకోడానికి ఇష్టంలేక స్వామిని ఆశ్రమంలోనే ఉండమని శతవిధాల నచ్చచెప్పారు. ఆయన బాధపడటం చూడలేక షిరిడీ వెళ్ళి తిరిగి వస్తానని చెప్పి ఆయన అనుమతితో షిరిడీకి పయన మయ్యారు మన స్వామీజీ. ఆ మరుసటి దినమే షిరిడీ నుంచి వచ్చిన ఒక సాయి భక్తుడు అక్కడ గల ద్వారకామాయి, చావడి, గురుస్థాన్, లెండీ బాగ్, సమాధి మందిరం మొదలగు మందిరాల గురించి వివరించి షిరిడీకి ఎలా వెళ్ళాలో కూడా వివరంగా వివరించారు. ఆరోజు ముగ్గురు సాధువులు మౌని బాబా ఆశ్రమానికి వచ్చి తాము కాశీ వెళ్ళుచున్నామని ముందుగా నాసిక్ నుండి షిరిడీ వెళతామని స్వామి కూడా తమతో

వస్తే అందరూ కలిసి షిరిడీ వెళ్ళ వచ్చునీ చెప్పారు. నాసిక్ రోడ్డు స్టేషన్ నుంచి అర్ధరాత్రి రైలు కలదని స్వామిని ఆ సమయానికి స్టేషనుకు రమ్మని చెప్పి వెళ్ళి పోయారు. ఏ భక్తుడైనా షిరిడీ వెళ్ళాలని మనస్ఫూర్తిగా కోరుకుంటే వారికి ఏవిధమైన ఆటంకం కలగ కుండా సాయియే అన్ని సదుపాయాలు సమకూరుస్తాడని సాయి భక్తులందరికి తెలిసిన విషయమే. అది వేసవి కాలం కావటంతో పగటి పూట ఎండ వేడిమి విపరీతంగా ఉండడంతో సాయం సమయంలో మౌని బాబా ఆశీర్వాదం తీసుకుని నాసిక్ రోడ్డు స్టేషన్‌కు కాలినడకను బయలు దేరారు మన స్వామీజీ. కొంత దూరం నడిచిన తరువాత ఒక పోలీసు జీపు వచ్చి స్వామి ప్రక్కనే ఆగింది. అందులో నుంచి ఒక పోలీసు అధికారి స్వామిని "**రాత్రి సమయంలో ఎక్కడకు వెళుతున్నావు**" అని ప్రశ్నించగా స్వామి "**షిరిడీ**" కని సమాధాన మిచ్చారు. స్టేషను చాలా దూరమున్నదని స్వామిని జీపులో ఎక్కించుకుని స్టేషను దగ్గర దింపి టీ ఇప్పించి సాయిబాబాకు తమ నమస్కారాలు అందజేయ మని వేడుకున్నారు. రైలు వచ్చే సమయానికి ఒక గంట ముందుగానే ఆ ముగ్గురు సాధువులు కూడా వచ్చి స్వామిని కలుసుకున్నారు. నలుగురు టిక్కెట్లు లేకుండా రైలులో ప్రయాణించి మన్మాడు చేరి మరొక రైలులో షిరిడీకి అతి సమీపానగల కోపర్‌గాం స్టేషనుకు చేరారు. ఆ రోజుల్లో గోదావరి నదికి వంతెన లేదు. ప్రయాణీకులను పడవల మీద ఒక తీరం నుండి మరొక తీరానికి చేర్చేవారు. పడవ నడిపే వ్యక్తి వీరి వద్ద పైకము తీసుకోకుండానే ఆవలి వడ్డుకు చేర్చాడు. అక్కడ నుండి కాలి నడకన షిరిడీకి ప్రయాణం కొనసాగించారు.

## షిరిడీ ప్రవేశం :

1953వ సంవత్సరం బాబాకు అత్యంత ప్రీతికరమైన శ్రీరామనవమి ఉత్సవములు ముగిసిన కొద్ది రోజులకే, బాబా పాదధూళిచే పవిత్రత నొందిన షిరిడీ పుణ్య భూమిపై బాబా ప్రథమంగా షిరిడీలో కాలిడిన సరిగా శతాబ్ద కాలానికి స్వామీజీ షిరిడీ పవిత్ర ధరిత్రిపై కాలిడినారు. ఆనాటి నుంచి తమ దేహత్యాగం చేసే వరకు రెండు పర్యాయాలు మాత్రం షిరిడీ పొలిమేరలు దాటి మిగిలిన సమయాన్నంతా సాయి సేవకే వినియోగించి సకల దేవతా స్వరూపి సాయియని, మానవునికి ముక్తి నొసంగే పుణ్య తీర్థాలైన

**''హరిద్వార్, మథుర, కాశీ, షిరిడీ మే తీరథ్ సారే హై**
**సాయి బాబాకేచరణోంమే చారోధాం హమారే హై''**

అని ప్రతినిత్యం చావడిలో భజన చేయటమే గాక దానిని త్రికరణ శుద్ధిగా ఆచరించిన పుణ్యమూర్తి మన శ్రీ శివనేశన్ స్వామీజీ.

షిరిడీలో కాలిడగానే ప్రథమంగా ద్వారకామాయిని దర్శించి అక్కడ గల బాబా చిత్రపటాన్ని చూచిన స్వామీజీ అత్యంత ఆశ్చర్య చకితులయ్యారు. తమ బాల్యంలో వారి ఇంటికి సమీపాన గల గుహలో చూచిన చిత్రపటం ద్వారకామాయి లోని చిత్రపటం రెండు ఒకటి కావటమే ఆ ఆశ్చర్యానికి కారణం. ఈ వింతను చూచిన స్వామీజీ తనువు పులకించి తనపై బాబా ఆశీస్సులు బాల్యం నుంచీ ఉన్నాయని గ్రహించి బాబా సన్నిధినే తన స్థిరనివాసంగా మార్చుకున్నారు.

స్వామీజీతో పాటు వచ్చిన ముగ్గురు సాధువులకు స్వామీజీకి కూడ సంస్థాన్ వారు మూడు రోజుల ఉచిత భోజన సౌకర్యాన్ని కల్పించారు. నాల్గవనాడు ఆ ముగ్గురు సాధువులు కాశీకి ప్రయాణమై వెడలిపోగా స్వామీజీ మాత్రం షిరిడీలోనే ఉండిపోయారు.

స్వామీజీ షిరిడీ చేరే నాటికి ఆయన వయస్సు 26సం॥లు అటువంటి యవ్వన వయస్సులో అరిషడ్వర్గాలను జయించడమే గాక ప్రతి నిమిషాన్ని సాయి సేవకై వినియోగించి తీరిక సమయాల్లో ధ్యానం చేసుకొనేవారు. పోస్టాఫీసు సమీపాన గల కానిఫ్ నాథ్, మారుతి, గణేశ్, శని, శంకర్ మందిరాలలోనూ, గురుస్థాన్, చావడి, ద్వారకామాయి, లెండీబాగ్, బూటీవాడాలోనూ సేవ చేసేవారు. స్వామికి ద్వారకామాయిలో ఉండడానికి అనుమతి లభించలేదు. ప్రస్తుతము షిరిడీసాయి స్టోర్స్ గల వెనుక భాగంలో ఒక చిన్న గదిలో ఉండేవారు. ఆ సమయంలో ఆ షాపులో దొంగతనం జరుగగా స్వామి ఆ గదిని ఖాళీ చేసారు. కొన్ని రోజులు గడిచిన పిమ్మట కానిఫ్‌నాథ్ మందిరపు పూజారి స్వామీజీ నిష్ఠ తత్పరతకు, నిస్వార్థ సేవకు ముచ్చటపడి స్వామిని కానిఫ్‌నాథ్ మందిరంలో ఉండడానికి అనుమతించి మందిర తాళాలు కూడా ఇవ్వటమే గాక ప్రతినిత్యము రొట్టె, టీ కూడా ఇచ్చేవారు. కానిఫ్‌నాథ్ మందిర పూజారి అయిన చాంద్ భాయి షిరిడీ సాయి సంస్థానంలో వాచ్‌మెన్‌గా పనిచేసేవారు.

స్వామీజీ ప్రతినిత్యము వేకువ జామున 3గం॥ లకే నిద్రలేచి ఖండోబా మందిరము దగ్గరగల 'శివఉధ' అనే చోట స్నానం చేసేవారు.

'శివఉధ' లోనీరు పుష్కలంగా ఉండటంతో ఆనీటితో ఆ చుట్టు ప్రక్కల భూములు సైతం సాగు చేసుకొనే వారు. ఒకసారి వర్షాకాలంలో నీటి మట్టం బాగా పెరిగి వేగంగా ప్రవహిస్తున్న సమయంలో స్నానానికి దిగిన స్వామి ఆ వేగానికి కొట్టుకు పోతుంటే ఏమి చేయాలో పాలుపోని స్వామి ''బాబా బాబా'' అని ఆర్తితో బాబాను వేడుకోగా బాబాయే స్వామిని సురక్షితముగా ఆవలి ఒడ్డుకు చేర్చారు. **''నన్ను నమ్మిన వారిని ఎన్నడూ పతనం కానివ్వను''** అన్న బాబా అభయ హస్తం స్వామీజీ జీవితంలో అక్షర సత్యమైంది. ప్రతినిత్యం స్నానానంతరం సుమారు ఒక గంట సేపు ధ్యానస్థులై 4 గంటలకు ద్వారకామాయి తెరిచే సమయానికి అక్కడకు వచ్చి లెండిబాగ్‌లోని బావిలో నీరు తెచ్చి ద్వారకామాయి శుభ్రంచేసి బాబా పటాలకు గంధము, కుంకుమ బొట్లు పెట్టి పూలమాలలు వేసి అలంకరించేవారు. శివఉధ నీటితో శని, శంకర, గణపతి, మారుతి మందిరాలను శుభ్రం చేసేవారు. మధుర మహారాజు లాల్ బాబా అనే ఆయన బాబా తోటనుంచి పుష్పాలను తెచ్చి ద్వారకామాయిని అలంకరించేవారు. ఆయన షిరిడీ నుండి వెళ్ళిన తరువాత స్వామీజీ ఆ పనిని చేసేవారు. ఈ బాబా పూలతోట 'భక్త నివాస్' దగ్గర ఉండేది.

సాయిబాబా షిరిడీలో గల దేవాలయాలన్నిటిని శిథిలావస్థకు చేరుకున్న సమయంలో బాగు చేయించగా స్వామీజీ ఆ మందిరాలన్నిటిలోను సేవచేసారు.

స్వామీజీ కానిఫ్‌నాథ్ మందిరంలో ఉంటున్న తరుణంలో వేరొక సాధువు వచ్చి అక్కడ మకాం చేయడంతో అక్కడ ఇద్దరు ఉండటానికి వీలుకాక స్వామీజీ తన మకాంను మారుతీ మందిరానికి మార్చారు.

ఆ రోజుల్లో కొంతమంది భక్తులు సాధువుల మీద సంస్థానం వారికి ఫిర్యాదు చేయగా సాధువులెవ్వరూ మూడు రోజులకు మించి షిరిడీలో ఉండకూడదని ఉత్తర్వులు జారీ చేసి సాధువులందరినీ షిరిడీ నుండి పంపివేసారు. కానీ సాయికి అత్యంత ప్రీతి పాత్రుడు, నిస్వార్థ సాయి సేవకుడు, నిరంతర సాయి కీర్తనాభిలాషి అయిన మన స్వామీజీని మాత్రము షిరిడీలోనే ఉండటానికి అంగీకరించారు.

అప్పట్లో స్వామికి రోజు గడవటానికి నాల్గు అణాలు సరిపోయేవి. అంత దక్షిణ లభించని రోజు ఒక బన్ను తిని టీ త్రాగి వాటికి కూడ డబ్బులు లేని రోజు లెండీబాగ్ లోని బావి నీరు త్రాగి కాలం గడిపేవారు. ఎట్టి పరిస్థితులలోనూ దేనికీ ఎవ్వరినీ యాచించే వారు కాదు. ఆకలికి తాళలేని స్వామీజీ ''బాబా నాకు ఆస్తిపాస్తులు వద్దు, ఆకలి బాధ తీరడానికి అన్నమైనా పెట్టించు లేక ఆకలైనా లేకుండా చేయి'' అని ప్రార్థించేవారు.

ఒకవైపు ఆకలి బాధను భరించలేక మరియొక వైపు ప్రజలు పెట్టే కష్టాలు ఓర్చుకోలేక షిరిడీ వదిలి ఎక్కడికైనా వెళ్ళిపోదామని తలంచి తనకు గల ఒక జత బట్టలను, పుస్తకాలను మూటగట్టుకుని

కాలినడకన షిరిడీ పొలిమేరలు దాటారు. మధ్యాహ్న సమయం వరకూ నడిచి అలిసిపోయిన స్వామీజీ ఒక చెట్టు క్రింద నిద్రించి, సాయంత్రానికి నిద్రలేచి చెట్టు పైకి చూడగా అక్కడ బాబా చిత్రపటము వ్రేలాడుతూ కనిపించింది. ఇది చూచిన స్వామీజీ తాను నిద్రించేముందు లేని ఈ బాబా చిత్రపటం ఎక్కడ నుంచి వచ్చింది, ఇదేమి విచిత్రం అని తలపోస్తూ దాహం తీర్చుకోడానికి ఆ చెట్టు వద్దనే గల బావి వద్దకు వెళ్ళి చూడగా నీరు పైకే ఉన్నాయి కానీ చేతికి అందేంతగా లేవు. చెట్టు కొమ్మమీద నుంచి బావిలోకి వంగి చెంబుతో నీరు అందుకోవచ్చుని తలచిన స్వామీ తమ జోలెలో చెంబుకోసం వెదుకగా అది కనపడలేదు. దీని సారాంశాన్ని స్వామి తాను బాబాకు దూరంగా వెళితే నీరు కూడా లభించదని ఇదంతా బాబా లీలే నని గ్రహించి ఆ రాత్రికే తిరిగి షిరిడీ చేరారు.

ఒక పర్యాయము స్వామీజీ వస్త్రాలు జీర్ణమై పోయి కట్టుకున్న వస్త్రంతో మిగిలారు. లెండీబాగ్‌లో కూర్చుని తన కష్టాన్ని సాయినాథునికి విన్నవించుకుని ధ్యానస్థులవ్వగా ఆ ధ్యానంలో ఒక అపరిచిత వ్యక్తి తనకు నూతన వస్త్రాల నిచ్చినట్లు భ్రాంతి కలిగింది. ధ్యానం ముగిసిన తరువాత ఒక వ్యక్తి వచ్చి స్వామికి రెండు నూతన వస్త్రాలు సమర్పించి తనకు సాయి స్వప్నంలో కనిపించి లెండీబాగ్‌లో ధ్యానం చేసుకుంటున్నతనికి నూతన వస్త్రాలు ఇవ్వమని ఆదేశించగా తాను ఆవిధంగా సమర్పిస్తున్నట్లు విశదీకరించి వాటిని స్వీకరించ వలసిందిగా స్వామిని వేడుకున్నాడు.

మరొక పర్యాయము స్వామీజీ దుస్తులు మురికితో మాసిపోగా ఉతుక్కోడానికి సబ్బులేక, కొనుక్కోటానికి డబ్బులేక లెండీబాగ్‌లో అదే ధ్యాసతో ఆలోచిస్తూండగా ఒక ఆవుల మంద స్వామి ముందర నుండి వెళ్ళింది. అవి వెళ్ళిన తరువాత చూస్తే ఒక ఆవు పాద ముద్రలమీద క్రొత్తది బట్టలు ఉతుక్కునే సబ్బు దొరికింది. గోమాత పాద ముద్రలో స్వామికి వలసిన దానిని ప్రసాదించి తనకు శ్రీకృష్ణ పరమాత్మకు భేదం లేదని మరొక సారి నిరూపించుకున్నారు మన సాయిబాబా.

ఒక రోజు స్వామీజీ సమాధి మందిరంలో ధ్యానం చేసుకుంటూంటే ఆయన బట్టలు( ఒక తుండు) పుస్తకాలను ఎవ్వరో దొంగిలించుకు పోయారు. స్వామీజీ కట్టుబట్టలతో మిగిలారు. దీనికి కూడా స్వామీజీ ఏమాత్రం విచారించక బాబాను ధ్యానిస్తూ లెండీబాగ్‌లో కూర్చున్నారు. ధ్యానంలో ఒక అపరిచిత వ్యక్తి తనకు బాబాకు కప్పినటువంటి వస్త్రం లాంటిది ఇస్తున్నట్లుగా భ్రమ కలిగింది. ఒక అర్ధగంట గడిచిన తరువాత ఒక వ్యక్తి వచ్చి స్వామీజీకి ధ్యానంలో కనపడినటువంటి వస్త్రాన్నే బహూకరించాడు. మరికొద్ది నిమిషాలకే వేరొకతను వచ్చి స్వామీజీకి వస్త్రాలు బహూకరించిన వ్యక్తికి నూతన వస్త్రాల నిచ్చి వెళ్ళిపోయాడు. స్వామీజీకి మొదట వస్త్రాల నిచ్చిన వ్యక్తిబాబా స్ఫూర్తితో తాను వస్త్రాల నివ్వగా బాబాయే స్వయంగా తనకు నూతన వస్త్రాల నిచ్చాడని సంతోషించి స్వామీజీకి భోజనం కూడ పెట్టించాడు. తాను బాబా మందిరం నిర్మించ దలచినట్టు అందుకు బాబా ఆశీర్వాదం లభించే వరకు

అన్నపానీయాలు ముట్టనని నిరాహార దీక్షను ప్రారంభించాడు. ''**నా భక్తులను ఎన్నడు పస్తులుంచను**'' అని అభయ మిచ్చిన బాబా తన మందిరం నిర్మించ దలచిన భక్తుని పస్తులుంచుతారా? ఆ మరుసటి దినమే ఆ భక్తుని సంచిలో రెండు వెండి కళ్ళు లభ్యమవ్వటంతో అదే బాబా ఆశీర్వాదంగా భావించి నిరాహార దీక్షను విరమించాడు.

ఒకసారి స్వామీజీకి కడుపులో మంటరాగా పెరుగు త్రాగుదా మనుకుంటే డబ్బులు లేక షిరిడీసాయి స్టోర్సు యజమాని నడిగి ఒక రూపాయి అప్పు తీసుకుందామని వెళ్ళగా దాని యజమాని లేడు. షాపులో పనిచేసే గుమాస్తా స్వామికి అప్పివ్వ నిరాకరించాడు. స్వామీజీ లెండీబాగ్‌కు వెళ్ళి అక్కడ గల కాలువలో ముఖం కడుక్కుంటుంటే నీళ్ళలో అర్ధరూపాయ నాణెం ఒకటి, పావలా నాణెం ఒకటి, బేడ నాణెం ఒకటి రెండు అణాకాసులు మొత్తం కలిపి ఒకరూపాయ దొరికింది. దానితో పెరుగు త్రాగగా బాధ నివారణ కలిగింది. సాయిని ఎంత దృఢ భక్తితో కొలిస్తే అంత వేగిరమే సాయి మన మనో వాంఛల నీడ్డేరుస్తాడని నిరూపిస్తున్నది ఈ సంఘటన.

స్వామీజీ షిరిడీ వచ్చిన క్రొత్తలో తమ బట్టలను ఎల్లప్పుడూ తెల్లగా ఉండేటట్లు శ్రద్ధ వహించేవారు. కానీ ద్వారకామాయిలోని దీపాలను శుభ్రం చేసేటప్పుడు నూనె అంటుకొని మురికి అయ్యేవి. కొన్ని రోజులు గడిచిన తరువాత ధరించే వస్త్రాలను తెల్లగా మల్లెపూవువలె ఉంచుకొనే దానికంటే మనస్సును స్వచ్ఛంగా ఉంచుకోవాలని గ్రహించి బట్టలయందు శ్రద్ధ చూపేవారు కాదు. చాల



ధ్యానస్థులైన పూజ్య స్వామీజీ

సంవత్సరాలు ఒక తుండు మాత్రమే కట్టుకుని మరొక తుండును తలపాగగా కట్టుకొనే వారు. చొక్కాగానీ, బనీను గానీ ధరించే వారు గాదు. వయస్సు మళ్ళిన తరువాత స్వామీజీని తరచూ ఆస్తమా బాధించడం వల్ల వైద్యుల సలహాపై బనీను ధరించడము మొదలు పెట్టారు. ఒక రోజున బొంబాయి నుండి ఒక సాయి భక్తుడు బాబా దర్శనానికి వచ్చి తాను రోజూ ఒక మనిషికి భోజనము ఏర్పాటు చేయదలచి అందుకు గాను కొంత ధనాన్ని సమాధి మందిరంలో పూజారిగా పనిచేస్తున్న శ్రీ ఉద్ధవ రావు దేశ్ పాండే (శ్రీ శ్యామా కుమారుడు) కు ఇచ్చాడు. స్వామీజీ అంత చిన్న వయసులోనే ఎంతో పరిణితి చెందిన వ్యక్తులకన్నా మిన్నగా సాయి సేవ చేస్తున్నందుకు బొంబాయి భక్తుడు ఇచ్చిన డబ్బుతో భోజనాన్ని బాబాకు నివేదించి దానిని స్వామీజీకి ఇచ్చేవారు. ఆనాటి నుంచి అదే ఆచారంగా మారి స్వామి సమాధి చెందే వరకూ సాయికి నివేదించిన ప్రసాదాన్ని స్వామికి ఇచ్చేవారు సంస్థాన్ వారు.

ఒకసారి స్వామీజీకి ద్వారకామాయిలోని బాబా పటంలో ముగ్గురు వ్యక్తులు దర్శన మిచ్చారు. అందులో ఒకరు లక్ష్మీనాథ్ జటాశంకర్ త్రివేది. ఈయనను స్వామీజీ మొట్టమొదటి సారిగా ఖండోబా మందిరం దగ్గర కలుసుకున్నారు. బాబా పటంలో కనిపించిన వ్యక్తి కళ్ళెదురుగా కనిపించే సరికి స్వామి ఆశ్చర్య భరితులై ఆయనకు నమస్కరించి పరిచయం చేసుకున్నారు. ఇద్దరూ అకుంఠిత సాయి భక్తులు అవటం వలన మంచి మిత్రులయ్యారు. శ్రీ త్రివేది నూట ఎనిమిది పర్యాయాలు షిరిడీకి వచ్చి బాబాను దర్శించారు.

ప్రతిసారి భక్తులను తీసుకు వచ్చి వారికి బాబా లీలలను వివరించేవారు. బీదలకు విరివిగా అన్నదానమూ, వస్త్రదానమూ చేసేవారు. ధునికి సమర్పించడానికి ఆవునెయ్యి, సాంబ్రాణి, అగరువత్తులు మొ॥ దీపాలు వెలిగించడానికి నూనె స్వామీజీకి మంచి వస్త్రాలు, పురాణ గ్రంథాలను సమర్పించే వారు. ఒకసారి ఈయన ఒక పెద్ద డబ్బా నూనెను తెచ్చి స్వామీజీకి ఇచ్చి ద్వారకామాయిలో దీపాలను వెలిగించమని కోరాడు. ఆ రోజు ఆ నూనెతో ద్వారకామాయిలో బాబా సశరీరులుగా ఉన్నప్పుడు వెలిగించే దీపాల సంఖ్యకు తగ్గకుండా ద్వారకామాయి మొత్తం దీపాలతో అలంకరించగా అది చూచిన భక్త సందోహం ఆ రోజు దీపావళిని మరిపించిందని ఆనంద భరితులయ్యారు. మరొకసారి శ్రీ త్రివేది స్వామీజీకి అతి విలువగల నూతన వస్త్రాలు సమర్పించగా దుస్తులయందు ఆసక్తిలేని స్వామీజీ వాటిని ఒక ఫకీరుకు సమర్పించారు. ఆ ఫకీరు ఆ నూతన వస్త్రాలు ధరించి అక్కడ పారాయణం చేసుకుంటున్న త్రివేదికి కనపడగా త్రివేది ఆ వస్త్రాలను స్వామికి సమర్పించగా ఈ ఫకీరు దగ్గరకు ఎలా వచ్చినవని ఆలోచిస్తూంటే ఆ ఫకీరు ''నీవు నాకు చాలాకాలం నుంచి తెలుసు ఈ వస్త్రాలను నీవు శివనేశన్‌కు సమర్పించినవే'' అని చెప్పి వెళ్ళి పోయాడు. ఇది చూచిన త్రివేది ఆ ఫకీరును తానింతకు ముందు చూచి ఉండకపోయినా అతను చాలాకాలం నుంచి పరిచయముందని చెప్పాడు. ఇదెలా సాధ్యమా అని స్వామీజీ దగ్గరకు వెళ్ళి జరిగినదంతా వివరించగా స్వామీజీ వెంటనే ''ఆ ఫకీరు ఎవరో కాదు సాక్షాత్తు సాయినాథుడే. లేకపోతే ఈ వస్త్రాలను నీవు నాకు ఇచ్చినట్లు ఆయనకు ఎలా తెలిసింది? అంతేకాక అతను నీ వద్దకు వచ్చి ఈ వస్త్రాలను నీవే

ఇచ్చావనీ చెప్పారంటే అది సాయినాథునికి తప్ప అన్యులకు అసాధ్యం'' అన్నారు. సాయినాథుని దర్శించిన ఆ ఇరువురు భక్తులు ఆనందోత్సాహాలతో ఒకరి వలవ ఒకరికి సాయి దర్శన భాగ్యము లభించిందని దానికి కారణం నీవంటే నీవని పొగడుకున్నారు. దీనివల్ల సాయినాథుని పేరిట మనం ఎవ్వరికి ఏది సమర్పించినా అది సాయి నాథుడే స్వీకరిస్తాడని ఋజువవుతోంది.

స్వామీజీకి బాబా చిత్రపటంలో కనిపించిన రెండవ వ్యక్తి పేరు శ్రీ యం. ప్రభు. ఇతను కూడా నిస్వార్థ సాయి సేవా తత్పరుడు. ఇతను ద్వారకామాయిలో పారాయణము చేస్తూంటే పరిచయం చేసుకుని స్నేహితులయ్యారు. వీరిరువురు సాయి లీలలను అర్థరాత్రి వరకూ ఒక్కొక్కసారి తెల్లవార్లూ ద్వారకామాయిలో కూర్చొని ముచ్చటించుకొనేవారు. శ్రీ ప్రభు ద్వారకామాయిలో అంగ ప్రదక్షిణలు చేసేవారు. అతని కుమార్తెలు విన్ని, బృంద ద్వారకామాయిలో విష్ణుసహస్రనామాలు పఠించేవారు. విన్ని స్వామీజీతో చాల చనువుగా ఉండేది. ఈ వివరాలను శ్రీమతి విన్ని, చిక్లూరి స్వయంగా తెలిపారు. ఇంతేకాక స్వామీజీకి ధనంపై ఏమాత్రం వ్యామోహం లేదు. ఆయన తలచుకుంటే ఆయనకు వచ్చే దక్షిణతో షిరిడీనే కొనగలిగే వారు అని కూడ తెలిపారు. ఈమె బాల్యం నుండి స్వామీజీని ఎరుగుదునని చెప్పారు. ఒకసారి ప్రభు భార్యకు అనారోగ్యం చేసి ఎన్నో ఔషధాలు వాడినా ప్రయోజనం కనిపించక నిత్యానంద స్వామి దర్శనానికి ఆమెను తీసుకుని వెళ్ళగా నిత్యానంద స్వామీజీ ఆమె మీదకు ఒక రాయిని విసరగా ఆమె అనారోగ్యం మటుమాయమైంది. తరువాత

నిత్యానంద స్వామీజీ వారికి శనగలను ప్రసాదంగా పంచారు. ఆ కుటుంబ సభ్యులు ఈ నాటికీ శనగలను నిత్యానంద స్వామి ప్రసాదంగా స్వీకరిస్తారు.

స్వామీజీకి బాబా చిత్ర పటంలో కనిపించిన మూడవ వ్యక్తి ఎవరైందీ స్వామీజీ వివరించలేదు.

స్వామీజీ యొక్క నిస్వార్థ సాయి సేవను గుర్తించిన అప్పటి సంస్థాన్ కోర్టు రిసీవరు చావడి బాధ్యతను స్వామీజీకి అప్పగించారు. ఆ రోజుల్లో చావడిని గురువారం మాత్రమే ఉదయం 6 గంటల నుండి మధ్యాహ్నం 2 గంటల వరకు తిరిగి సాయంత్రం 4 గంటలనుండి రాత్రి 8.30 వరకూ తెరిచి ఉంచేవారు. ప్రతి గురువారం చావడిని తెరిచి శుభ్రంచేసి ఎంతో అందంగా అలంకరించే వారు స్వామీజీ. అందువలననే స్వామీజీని చాలా మంది ''**చావడి బాబా**'' అని సంబోధించేవారు. స్వామీజీ చావడి బాధ్యతను అత్యంత శ్రద్ధాభక్తులతో నిర్వర్తించడంతో ఆయన సేవకు సంతృప్తి చెందిన రిసీవరు భక్తులకు బాబా ప్రసాదం పంపే కవర్ల పై చిరునామాలు వ్రాసే పనిని కూడా స్వామికి అప్పగించి అందుకుగాను నెలకు రూ. 15/-లు స్వామికి గౌరవ భృతిగా ఇచ్చి స్వామీజీకి ద్వారకామాయిలో పల్లకీ ప్రక్కన గల గదిలో ఉండడానికి వసతిని కూడా ఏర్పాటు చేశారు. దీనితో స్వామీజీకి భోజనానికి, దానధర్మాలు చేయడానికి ధనం, ఉండటానికి వసతి లభించాయి. సాయి కోరి పిలిపించుకున్న స్వామికి ద్వారకామాయిలో నివసించడానికి వీలుకల్పించడమే గాక బాబా

నైవేద్యాన్ని స్వామికే చెందేలాగా చేసి ''**నన్ను నమ్ముకున్న వారి నెన్నడునూ పతనం కానివ్వను**'' అన్న బాబా అభయం ఇందుకు ఒక నిదర్శనం మాత్రమే.

స్వామీజీ సేవాతత్పరతను అనేక మంది సాయి భక్తులు గుర్తించి ఆయనకు మంచి దుస్తులు, శాలువలు, దక్షిణలు సమర్పించే వారు. స్వామికి సమర్పించిన ప్రతిదీ సాయికే చెందుతుందని చాలా మంది భక్తులు ప్రగాఢంగా విశ్వసించేవారు. అనేక పర్యాయములు తీవ్ర ఆకలి బాధను అనుభవించిన స్వామీజీ తనకు వచ్చిన దక్షిణతో బీదలకు అన్నదానం చేసేవారు. భక్తులు తనకు సమర్పించిన వస్త్రాలను, శాలువలను, బీదలకే పంచే వారు. తనకు ఎన్నెన్నో విలువైన శాలువలు, వస్త్రాలు లభించినా వాటిపై స్వామి మక్కువ చూపక కొల్లాయి గుడ్డతోనే తన జీవితాన్ని గడుపుకొని తనకు లభించిన వస్త్రాలను బీద సాదలకు దానం చేసేవారు. తనకు ధనంతో పని లేదని సాయి సేవయే పరమార్థంగా భావించి తనకు వచ్చిన దక్షిణతో బీదలకు అన్నదానం చేసేవారు. సాయిబాబా కూడా తనకు వచ్చిన దక్షిణతో తామే వంటచేసి అన్నదానం చేసిన సంగతి సాయి భక్తులందరికీ విదితమే. అదే తీరున మన స్వామీజీకూడా తనకు లభించిన దక్షిణతో పచారీ సామానులు కొని అన్నం, సాంబారు తామే స్వయంగా వండి బీదలకు తృప్తిగా అన్నదానం చేసి వారికి దక్షిణ తాంబూలాలు సమర్పించి వారి సేవను స్వీకరించిన భక్తులను సాయి స్వరూపులుగా భావించి వారికి పాదాభి వందనం చేసి 'అతిథి దేవోభవ' అన్న ఆర్యోక్తిని త్రికరణ శుద్ధిగా ఆచరించే వారు. స్వామీజీ అన్నదాన కార్యక్రమంలో భక్తులు ఎంతో

ఉత్సాహంగా పాల్గొనేవారు. స్వామీజీ అన్నదానం చేస్తున్న రోజున చాలా మంది భక్తులు ఇండ్లలో వంట చేసుకోవడం మానివేసి స్వామి భిక్షకు తండోపతండాలుగా తరలి వచ్చేవారు. ఆయన చేతి వంట ఎంతో రుచికరంగా ఉండేది. బాబా సశరీరులుగా ఉన్నప్పుడు ఆయనను దర్శించలేని ఆయన అమృత హస్తాలమీదుగా ప్రసాదం స్వీకరించే భాగ్యం లేని భక్తులు స్వామీజీ ఇచ్చిన ప్రసాదాన్ని స్వీకరించి ఆయనలోనే బాబాను చూసుకుంటూ స్వామీజీని ''**బాబా**'' అని గౌరవ పూర్వకంగా పిలిచే వారు. అన్ని దానాలలోకి అన్నదానమే మిన్న అన్న సాయి సూత్రాన్ని త్రికరణ శుద్ధిగా నమ్మి ఆచరించిన మన స్వామీజీ ధన్యజీవి. స్వామీజీ అన్నదాన కార్యక్రమాన్ని చూసి ప్రభావితుడైన శ్రీ పటేల్ అనే షిరిడీ నివాసి బాసుమతి బియ్యం, వంట చెయ్యడానికి వంట పాత్రలను స్వామీజీకి సమకూర్చేవారు. శ్రీ పురోహిత్ అనే మరో భక్తుడు కూడా వంట పాత్రలకు బాడుగ తీసుకోకుండా ఉచితంగా ఇచ్చేవారు. అన్నదానం చేయగా ఇంకనూ మిగిలిన ధనంతో అనేక భాషలలో వెలువడే సాయి సచ్చరితలు, బాలబాలికలకోసం అతి సులభ శైలిలో చిత్రాలతో వెలువడే పుస్తకాలను ఉచితంగా పంచేవారు మన స్వామీజీ. ప్రతినిత్యం ధునికి కొబ్బరికాయలు సమర్పించే వారు. బాబా తనకు భక్తి ప్రపత్తులతో భక్తులు సమర్పించే దక్షిణను సాయంకాలానికి దాన ధర్మాలు చేసి ఫకీరు వలె మిగిలే వారన్న సంగతి సాయి భక్తులమైన మన కందరికీ తెలుసు. అదేవిధంగా స్వామీజీ కూడా తమకు లభించే ధనాన్నంతా సాయి సొత్తుగానే భావించి సాయి స్వరూపులైన సాయి భక్తులకే దానిని సమర్పించి తాను మాత్రం ''**సాయిసేవకుడు**'' గానే మిగిలి పోయారు. ''**తన, మన, ధన,**

**అర్పణ తుఝుకో**'' అని ప్రతినిత్యం చావడిలో భజన చేసే స్వామీజీ దానిని త్రికరణ శుద్ధిగా ఆచరించి చూపారు.

నాసిక్ నివాసి శ్రీ రామానంద్ బాబా కి సుమారు 1960వ సం॥ నుంచి స్వామీజీతో పరిచయం కలదు. వీరు తరచు షిరిడీ వచ్చి బాబాను దర్శించుకుని తిరిగి నాసిక్ వెళుతుండేవారు. వీరు అవధూతల దర్శనార్థము వివిధ ప్రాంతాలు సందర్శించేవారు. రామానంద బాబాకు షిరిడీ లో చాలామంది దక్షిణ సమర్పించేవారు. అందులోంచి తమకు అత్యవసర ఖర్చులకు అతికొద్దిగా ఉంచుకొని మిగిలినది స్వామీజికి షిరిడీ వచ్చే యాత్రికులకు అన్నదానం, వస్త్రదానం కొరకు ఇచ్చేవారు. రామానంద బాబా తరచూ విదేహి సతీ అనసూయామాత, పారాడ్‌సింగా (నాగపూర్ జిల్లా) మరియు శబరిమాత (ఆంధ్రప్రదేశ్) లను దర్శించే వారు. మన స్వామీజీ రామానందబాబాతో వారికి బాబాప్రసాదాన్ని, ఊదీని పంపి వారి ఆశీస్సులను కోరమనే వారు. శబరిమాత రామానంద బాబాను చూడగానే ''**షిరిడీ ప్రసాదం వచ్చింది**'' అని సంతోష భరితంగా పలికేవారు. శబరిమాత ఆ ప్రసాదాన్ని స్వీకరించి స్వామీజీకి తిరిగి ప్రసాదాన్ని పంపేవారు. స్వామీజీ ఏనాడూ షిరిడీ దాటి వెళ్ళక పోయినా ఎంతోమంది అవధూతల దర్శనము, ఆశీర్వాదము స్వామీజీకి లభించినవైనాన్ని స్వామీజీ కృపతో ముందు ముందు మీకు వివరిస్తాను.

సాయికి అంకిత భక్తుడు, ప్రప్రథమంగా సాయిబాబా గురించి దక్షిణ భారతదేశంలో ప్రచారం చేసి మనకందరికీ బాబాను పరిచయం

చేసిన పుణ్యమూర్తి శ్రీ నరసింహస్వామీజీ. వీరు తమిళనాడులోని మద్రాసు నగరానికి చెందిన వారు. వీరికి 1936లో కలిగిన ఒక మహత్తర స్వీయానుభూతి ప్రభావం వల్ల బాబాకు అంకిత భక్తునిగా మారి బాబాను గూర్చి అనేక విషయాలను, లీలలను బాబాను సేవించి తరించిన భక్తులనుండి అత్యంత ప్రయాసలతో సేకరించి వాటిని బహుళ ప్రచారం చేసిన పావనమూర్తి శ్రీ నరసింహ స్వామీజీ. బాబా ప్రేరణతో వీరు లక్షలార్జిస్తున్న న్యాయవాద వృత్తిని త్యజించి ''ఆలిండియా సాయి సమాజ్-మద్రాసు'' స్థాపించి దాని వ్యవస్థాపక అధ్యక్ష పదవిని నిర్వహించి దక్షిణ భారతదేశంలోనే గాక యావత్ భారత దేశంలోను, విదేశీయులకు సహితం సాయితత్త్వాన్ని అందజేసిన ఘనత వీరికే దక్కింది. మన స్వామీజీ పూజ్య శ్రీ నరసింహస్వామీజీ నుంచి అనేక వెలుగు చూడని బాబా లీలలను సేకరించారు. శ్రీ నరసింహస్వామీజీని మన స్వామీజీ ఎంతో పూజ్య భావంతో పరిగణించేవారు. ఈనాడు దక్షిణ భారతదేశం నుంచి కోటానుకోట్ల మంది బాబా భక్తులయ్యారంటే దానికి మూల పురుషుడు శ్రీ నరసింహస్వామీజీ. ఈయన భక్తులు తరచూ షిరిడీకి వచ్చి బాబాను దర్శించుకొని భజనలు, కీర్తనలు, విరివిగా అన్నదానం, చేస్తూండే వారు. శ్రీ నరసింహస్వామీజీ తరువాత అంతటి కృషి సల్పిన వారు శ్రీ కేశవయ్య స్వామీజీ మరియు శ్రీ రాధాకృష్ణ స్వామీజీ. వీరు కూడా అనేక బాబా గ్రంథాలను ప్రచురించి బాబా ప్రచారానికి అవిరళ కృషిచేసిన ధన్యజీవులు. మన స్వామీజీ షిరిడీ చేరిన క్రొత్తలో సాయిని సేవించి తరించిన అనేక భక్తులు సాయి సమాధిని సందర్శించడానికి షిరిడీ వచ్చేవారు. స్వామీజీ వారికి అన్ని

సదుపాయాలు సమకూర్చి వారితో కలిసి మెలిసి తిరుగుతూ వారినుంచి అనేక సాయి జీవిత విశేషాలను సాయి మాహాత్మ్యాలను సేకరించి మన తరం వారికి అందించారు. వీటిలో ఇంత వరకూ ప్రచురితం కాని కొన్ని ఆణిముత్యాలను ఈ గ్రంథంలో పొందుపరచడం జరిగింది.

స్వామీజీ తానింకా సాయి సేవలో బాల్యదశలోనే ఉన్నానని గ్రహించి మరింత పట్టుదలతోనూ, ఉత్సాహంతోనూ సాయి సేవను కొనసాగించారు. స్వామీజీ ప్రతి నిత్యం షిరిడీలోగల మందిరాలలో 13 దీపాలను వెలిగించేవారు. (ద్వారకామాయిలో 5, చావడిలో 2, గురుస్థానంలో 2, దీక్షిత్ వాడాలో 1, పూర్వం సత్యనారాయణ వ్రతాలు జరిగే పై అంతస్తులో 1, సమాధి మందిరంలో 1, లక్ష్మిమందిరంలో 1 వెలిగించేవారు.

ఏ భక్తుడైనా ఆర్తితో 'సాయీ' అని పిలువగానే సాయినాథుడు కరుణించి కనికరిస్తాడని మనకందరికీ తెలుసు. అటువంటి సాయికి తన సర్వస్వాన్ని సమర్పించిన స్వామీజీని ఉపేక్షిస్తారా! సాయినాథుడు మన స్వామిని ఏ తీరున అనుగ్రహించి కరుణించినదీ తెలియచేయటానికి ఈ క్రింది సంఘటనలే సాక్ష్యం.

స్వామీజీని షిరిడీకి వచ్చే భక్తులంతా గౌరవ మర్యాదలతో చూడటం దక్షిణ, వస్త్రాలు మొదలగునవి సమర్పించడం, రిసీవరు చావడి బాధ్యతను స్వామికి అప్పగించి నెలకు రూ. 15/లు గౌరవ

భృతిని ఇవ్వడము, స్వామీజీ గౌరవము రోజు రోజుకూ పెరగడం చూచిన స్వామీజీ స్నేహితుడొకడు ఈర్ష్య, ద్వేషాలతో స్వామీజీకి బాబా ప్రసాదంలో విషం కలిపి తినిపించాడు. అది తిన్న స్వామీజీ వాంతులు, విరేచనములతో చిక్కి శల్యమయ్యారు. స్వామీజీ పరిస్థితి చూసి షిరిడీ సాయి సంస్థాన్ ఆస్పత్రిలో చేర్పించారు. నెలరోజులు ఆస్పత్రిలో ఉండి మందులు వాడినా గానీ ఆరోగ్యం ఏమాత్రం మెరుగు పడలేదు. వైద్యులు తమవల్ల కాదని ఆస్పత్రినుండి పంపించి వేశారు. అప్పట్లో స్వామి మిత్రుడైన శ్రీ కరుణాకరన్, తుకారాం పరదేశి అనే అతని ఇంట్లో ఒక గదిలో అద్దెకు ఉండేవాడు. అతనే స్వామీజీని తన గదికి తీసుకు వచ్చి ఉంచుకున్నాడు. ఆ యింటి యజమాని స్వామి పరిస్థితికి చాల భయపడ్డాడు. శ్రీ కరుణాకరన్ స్వామీజీ గురువుగారైన శ్రీ ముత్తయ్యగారికి ఈ విషయమంతా జాబు ద్వారా తెలుపగా వారు వెంటనే జరీ బుట్టి మొదలగు ఆయుర్వేద మందులతో షిరిడీకి వచ్చి నెలరోజులు వైద్య చేయటంతో స్వామీజీ శరీరంలోని విషమంతా పోయి సంపూర్ణ ఆరోగ్య వంతులయ్యారు. శ్రీ ముత్తయ్యగారు భక్తనివాస్‌లో బస చేస్తూ స్నానం చేయటానికి శ్రీ రామచంద్ర దేశ్ ముఖ్ యింటికి వెళ్ళేవారు. స్వామీజీ ఆరోగ్యవంతులైన పిదప ఓంకారేశ్వర్ వెళ్ళి తలనీలాలు యిచ్చి రమ్మని స్వామిని పంపారు. స్వామిజీ ఓంకారేశ్వర్ వెళ్ళి మొక్కు తీర్చుకుని వెంటనే షిరిడీకి తిరిగి వచ్చారు. అటు పిమ్మట స్వామీజీ ఏనాడూ షిరిడీ దాటి వెళ్ళలేదు. స్వామీజీ షిరిడీలో ప్రవేశించిన తరువాత రెండు పర్యాయములు మాత్రమే షిరిడీ పొలిమేరలు దాటిన వైనం భక్తులు గ్రహింతురు గాక! స్వామిపై విషప్రయోగం చేసిన వ్యక్తి ఎవరో స్వామికి తెలిసినా అతనిపై ఏమాత్రం

శ్రుతుత్వం వహించక అంతా తమ ప్రారబ్ధ కర్మమని సరి పెట్టుకొన్నారు.

స్వామీజీ సంపూర్ణ ఆరోగ్యవంతులైన పిదప తిరిగి ఎప్పటి వలె చావడి బాధ్యత, చిరునామాలు వ్రాసే పనిని అప్పగించారు.

స్వామీజీకి మరొకసారి అనారోగ్యం చేసినపుడు లెండీబాగ్‌లోని బాబా బావి నీరు మాత్రమే త్రాగి ఊదీని సేవించి నాల్గుహారతులకు హాజరవ్వగా కొద్ది రోజులలోనే స్వామి ఆరోగ్యవంతులయ్యారు. స్వామీజీకి ఏ అనారోగ్యం కలిగినా ఊదీని మాత్రం సేవించే వారు. వారి భక్తులు తెచ్చిన మందులను భక్తుల తృప్తి కొరకు మాత్రమే తీసుకొనేవారు. స్వామీజీ ఎల్లప్పుడూ ఊదీ దివ్యౌషధం అని ఎటువంటి రోగగ్రస్తులైనా బాబాపై భారం వేసి ఊదీని సేవిస్తే సంపూర్ణ ఆరోగ్యవంతు లౌతారని చెప్పేవారు.

బాబా మహాసమాధి చెందిన తరువాత భక్తులు చాల తక్కువ సంఖ్యలో షిరిడీకి వచ్చేవారు. చాల అరుదుగ వి.ఐ.పి. లు వచ్చేవారు. ఆ రోజుల్లో సాయి సమాధి చెందిన తరువాత ఇంకా షిరిడీలో ఏమున్నదనుకునే వారు సామాన్యులు. కానీ ''**నా సమాధి మాట్లాడుతుంది నా ఎముకలు మీప్రశ్నలకు జవాబిస్తాయి**'' అన్న బాబా మహాసమాధి చెందిన తరువాత కూడ తన నాశ్రయించిన వారి మనోవాంఛల నీడేర్చుతూ తనను నమ్ముకున్నవారి నమ్మికను వమ్ము చేయక వారిపై తన కరుణారసాన్ని కురిపించటం వల్ల ఈనాడు ప్రతినిత్యం లక్షలాది భక్తులు షిరిడీని దర్శించి పునీతులవుతున్నారు. పూజ్య శ్రీ నరసింహస్వామీజీ వెలువరించిన గ్రంథాలు చదివి

కొంతమంది, శ్రీ మనోజ్‌కుమార్ నిర్మించిన చలన చిత్రాన్ని చూసి మరి కొంతమంది బాబాను గురించి తెలుసుకొనటం వల్ల షిరిడీకీ వచ్చే భక్తుల సంఖ్య పెరగసాగింది.

స్వామికి కలిగిన ప్రతి చిన్న అసౌకర్యంనుంచి ప్రాణాంతకమైన విషప్రయోగాల నుంచీ కూడ సాయి కాపాడిన వైనాన్ని ఇంతవరకూ చదివారు. ఇవేగాక సాయి స్వామిని మరెన్నో ఆపత్తుల బారినుంచి ఆదుకున్న వైనాన్ని సాయి అనుగ్రహంతో ఇప్పుడు మీ ముందుంచుతాను.

ఒకనాటి రాత్రి స్వామీజీ లెండీబాగ్ నుంచి తిరిగి వస్తూంటే ఒక నాగుపాము దారికి అడ్డంగా పడగ పట్టి నిల్చుంది. ఆ నాగును చూచిన స్వామీజీ ఏ మాత్రం తత్తరపాటు పడక ''నన్ను వెళ్ళనివ్వు లేక నీవైనా వెళ్ళు'' అనగా ఆ నాగు స్వామీజీకి దారి ఇచ్చి తన దారిన తాను వెళ్ళిపోయింది. మరొక పర్యాయం కూడా స్వామికి పాము కనిపించగా ఆ ప్రక్కనే ఉన్న సంస్థాన్ వాచ్‌మెన్ పామును కర్రతో కొట్టబోగా స్వామీజీ అతనిని వారించి ప్రక్కకు తీసుకుని వెళ్ళారు. అంతలోనే శ్రీ ఆత్మానంద స్వామీజీ ఆ వాచ్‌మెన్ దగ్గర నుండి కర్రను తీసుకుని పాముకు అతి సమీపంగా వెళ్ళి కర్రతో పాముకు రెండువైపులా కొట్టి దానికి వేరే మార్గం చూపించగా ఆ దారిని పాము వెళ్ళిపోయింది.

దైవభక్తులకు కష్టాలు ఎందుకు ప్రాప్తిస్తాయని స్వామిని ప్రశ్నించగా కొన్ని పూర్వ జన్మ సుకృతము వల్ల, మరికొన్నిటిని భగవంతుడే భక్తునియొక్క దృఢభక్తిని పరీక్షించటానికి కష్టాలు

కల్పిస్తాడని సమాధాన మిచ్చేవారు. స్వామికి ఎంతటి విపత్తు కలిగినా దానిని ఓర్మితో ఓర్చుకొనేవారే కానీ సాయి సేవను మాత్రం నిర్లక్ష్యం చేసేవారు కాదు. స్వామికి తనపై గల ప్రగాఢ విశ్వాసానికి మెచ్చిన సాయి స్వామిని ఎంతో ఉన్నత స్థితికి తీసుకువెళ్ళారు. కొన్ని కొన్ని సందర్భాలలో ముందు జరగబోయే సంఘటనలను స్వామికి తెల్పేవారు. ఒకరోజు తెల్లవారు ఝామున ద్వారకామాయిలో బాబా పటాలకు బొట్లు పెడుతుండగా ''ఇప్పుడు కొంతమంది భక్తులు వస్తారు. వారి కుమారుడు తప్పిపోయాడు నేటినుంచి సరిగ్గా మూడవ దినాన వారికుమారుడు వారిని చేరుతాడు'' అని చెప్పమని తమిళంలో బాబా పటంనుండి మూడుసార్లు వినిపించింది. అంతలోనే తమిళంలో మాట్లాడుకుంటూ కొంతమంది భక్తులు ద్వారాకామాయిలో ప్రవేశించడం గమనించిన స్వామి వారి దగ్గరకు వెళ్ళి తప్పిపోయిన వారికుమారుడు 3 రోజులలో వారిని కలుస్తాడని బాబా చెప్పమని ఆజ్ఞాపించారని చెప్పగానే, వారు ఆశ్చర్య పోయారు. వారి కుమారుడు తప్పిపోయిన సైనం వారెవ్వరికీ చెప్పలేదు. వారు స్వామికి నమస్కరించి ఆ సాయంత్రమే తిరుగు ప్రయాణానికి సన్నాహాలు చేసుకున్నామని స్వామి చెప్పిన విధంగా జరిగితే వెంటనే తెలియ చేస్తామని చెప్పి శలవు తీసుకున్నారు. ఈ కలియుగంలో బాబా వాక్కుకు ఎదురు లేదని ఋజువు చేస్తూ ఆ తప్పిపోయినతను మూడవ నాటికి వారి తల్లిదండ్రులను కలిసాడు. ఇటువంటి అనేక లీలలు చేసిన బాబా వాటికి స్వామిని కారణ భూతుడుగా చేసేవారు. మరికొన్ని సందర్భాలలో బాబా స్వామీజీ రూపంతో దూరప్రాంతాలలో సహితం దర్శన మిచ్చి వారి బాధలను నివారించేవారు.

కరుణాకరన్ అనే భక్తుడు షిరిడీలో గల ''స్వామి మద్రాసు''హోటల్ లో పనిచేస్తూండేవాడు. స్వామిజీకి మంచి స్నేహితుడు కూడా. ఇతను ఉబ్బసము వ్యాధితో బాధపడేవాడు. ఒక నాటి రాత్రి విపరీతంగా ఆయాసము వచ్చి ద్వారకామాయిలో దుప్పటి కప్పుకొని స్తంభానికి ఆనుకుని కూర్చుని బాబా నామస్మరణ చేస్తుండగా స్వామి అతని దుప్పటి లాగి ఒక మూలికను చేతి కిచ్చి ''దీనిని నోట్లోపెట్టుకో, నీ బాధ తగ్గుతుంది'' అని చెప్పారు. కానీ అతడు ఆ మూలికను జేబులో వేసుకొని తెల్లవారిన తరువాత స్వామిని ఆ విషయం అడుగగా స్వామి తానాసమయంలో తమగదిలోనే ఉన్నట్లు, తాను ఏమూలికనూ ఇవ్వలేదని చెప్పారు. కరుణాకరన్ ఆ మూలికను తీసి చూపించగా, ఇది బాబా లీలే గానీ మరొకటి గాదని ఇద్దరూ తెలుసుకున్నారు. ఆ మూలికను తిన్న కరుణాకరన్‌కు ఛాతిలో పేరుకున్న కఫం బయటకు వచ్చి ఉపశమనం కలిగింది. ఆ మూలికలో కొంతభాగాన్ని తీసుకున్న స్వామీజీ దానిపేరు తెలుసుకొని తమ భక్తుల ద్వారా దానిని సేకరించి ఉబ్బసం ఉన్న వ్యక్తులకు ఇవ్వగా అది దివ్యౌషధంగా పనిచేసేది.

నేనం(ఈ గ్రంథ సంకలన కర్త) 1985 ఫిబ్రవరి నెలలోకుటుంబ సమేతంగా బాబా దర్శనానికి షిరిడీ వెళ్ళినప్పుడు జరిగిన ఈ సంఘటన స్వామీజీ ఎంతటి నిరాడంబరుడో, నిగర్వి మీకందరికీ తెలియజేస్తుందన్న విశ్వాసంతో మీ కందిస్తున్నాను. ఒక రోజు కాకడ హారతి అయిన తరువాత ద్వారకామాయి ప్రక్క నుంచి వెళుతుంటే స్వామీజీ నాకు ఎదురు వస్తున్నారు. ఆయన ఎవరో అప్పటికి

నాకు తెలియదు. ఇంతలోనే సుమారు 10 మంది ఆంధ్రా నుంచి వచ్చిన భక్తులు ఆయనను చుట్టు ముట్టి పాదనమస్కారము చేసుకుంటూంటే ఆయన విసుగుతో ''పొండి, పొండి నాకెందుకు నమస్కారాలు చేస్తారు, బాబా దగ్గరకు పొండి'' అని కస్సురు కుంటూ వారిని తప్పించుకోటానికి ప్రయత్నిస్తుండగా ఆ భక్తులలో ఒకరు ''మీరు మా అమ్మాయికి జ్వరం వచ్చినపుడు మా యింటికి వచ్చి ఆ అమ్మాయి నుదుట ఊదీని పెట్టగానే నెలరోజుల నుండి జ్వరంతో బాధపడుతున్న మా అమ్మాయికి స్వస్థత చేకూరింది'' అని చెప్పగా స్వామీజీ తానెవరింటికీ వెళ్ళలేదనీ, వారెవరో తనకు తెలియదని ప్రక్కనుంచి వెళ్ళబోతుంటే 6 లేక 7 సం॥ల చిన్నపాప స్వామిని చూపించి ఈ తాతే నాకు బొట్టు పెట్టారు అని చెప్పింది. బాబాయే తన రూపంలో దర్శనమిచ్చారని, అది బాబా లీలేనని, బాబానే నమ్ముకోమని వారికి తెలిపి తన దారిన తాను వెళ్ళి పోయారు.

ఇంత మహిమ గల స్వామీజీ తాను ''సాయి సేవక్'' (సాయి సేవకుడు) నని మాత్రమే చెప్పుకొనేవారు. సాయి భక్తుడనని చెప్పటానికి కూడా సాహసించేవారు కాదు. ఎప్పుడూ ఆడంబరాలకు పోయేవారు కాదు. ఇతరుల విషయాలలో జోక్యమే చేసుకొనే వారుకాదు. ప్రతి నిమిషం వారికెంతో విలువైనది. ప్రతి క్షణాన్ని సాయి సేవకే వినియోగించేవారు. సాయి భక్తులు తమ జీవితాలను ఎలా మలుచుకోవాలి, సాయి సేవను ఏవిధంగా చేయాలి, సాయి కరుణా కటాక్షాలను ఏతీరున పొందాలి తెలుసుకోటానికి స్వామీజీ జీవిత విధానమే మనకు మార్గ దర్శకం.

ఈనాడు ఆంధ్రప్రదేశ్ నుంచి షిరిడీ దర్శించే భక్తుల సంఖ్య విపరీతంగా పెరిగిందన్న సంగతి మీకందరకూ విదితమే. షిరిడీలో ఎక్కడ చూసినా ఎక్కువగా తెలుగు మాట్లాడేవారే తారస పడతారు. తెలుగునాట మారుమూలల పల్లెలలో సహితం బాబా మందిరాలు వెలిశాయంటే అతిశయోక్తి కాదు. ఆంధ్రప్రదేశ్‌లో బాబా ప్రచారం ఇంత విస్తృతంగా జరగటానికి మూలకారణం మన పూజ్య స్వామీజీయే. తెలుగు భాషలో ప్రథమంగా బాబా సంపూర్ణ చరిత్రను శ్రీ పత్తి నారాయణరావు గారు ''**సాయి బాబా జీవిత చరితము**'' అనే నిత్యపారాయణ గ్రంథాన్ని అందించగా దాని తరువాత ఆచార్య ఎక్కిరాల భరద్వాజ గారు అందించిన ఆణిముత్యం ''**సాయి లీలామృతం**''. దీని తరువాత ప్రముఖ నటుడు శ్రీ విజయచందర్ బాబా పాత్రను పోషించగా విడుదలైన చిత్రం ''**శ్రీ షిరిడీ సాయి బాబా మాహాత్మ్యం**''. వీటి వల్ల సాయి లీలలను చవి చూచిన అసంఖ్యాక ప్రజానీకం బాబాకు అంకిత భక్తులుగా మారి షిరిడీని దర్శించటం ప్రారంభించారు. అన్నిటి కంటే అతి ప్రభావితం చేసినవి ఆచార్య ఎక్కిరాల భరద్వాజ గారి కలం నుండి జాలువారిన ఆణిముత్యాలు.

ఈయనను సాయి భక్తులందరూ గౌరవ పూర్వకంగా '**మాష్టారు**' అని సంబోధిస్తారు. ఈయన షుమారు రెండు దశాబ్దాల కాలం శ్రమించి బాబాను దర్శించి సేవించిన భక్తులనుంచి వారి కుటుంబ సభ్యుల నుంచీ అనేక భాషలలో వెలువడిన సాయి గ్రంథాలను పరిశోధించి ''**సాయి లీలామృతం**''లో పొందు పరచారు. వీరి కృషిని

ప్రోత్సహించి, ఇతర భాషల (ముఖ్యంగా మరాఠీ) లో వెలువడిన అసంఖ్యాకమైన సాయి లీలలను అనువదించి మరియు తాను సేకరించిన సాయి లీలలను మాష్టారు గారికి అందించిన అమృతమూర్తి మన పూజ్య శ్రీ శివనేశన్ స్వామీజీయే. ఈ విషయాన్ని మాష్టారే స్వయంగా తమ గ్రంథాలలో పేర్కొన్నారు. మాష్టారు గారిని గురించి వారి కృషిని గురించి నేను మీకు తెలియ జేయటం కొంతవరకు హాస్యాస్పదమే అవుతుంది. మన పూజ్య స్వామీజీని గురించి ప్రథమంగా తెలుగు వారికి పరిచయ మొనర్చిన మాష్టారు గారిని గురించి కొంతైనా ప్రస్తావించక పోతే అది తెలిసి చేసిన తప్పిదమే గాక ఈ గ్రంథం అసంపూర్ణమే అవుతుంది. వీరు బాబాను గూర్చి ప్రథమంగా వెలువరించిన గ్రంథరాజమైన సాయిలీలామృతం నాటికీ నేటికీ ఏనాటికీ కూడ ప్రామాణిక మైనదని చెప్పటంలో అతిశయోక్తి లేదు. వీరు రచించిన ప్రతి గ్రంథం ఒకదానికి మించి మరొకటి. దేనికదే సాటి. ఒక్క బాబాను గురించే గాక అనేక అవధూతల చరిత్రలను మనకందించిన ఘనత మాష్టారు గారిదే. ఈయన తన చివరి శ్వాస వరకు తన జీవితాన్ని బాబా సేవకే అంకితం చేసిన పుణ్యమూర్తి. తనకు లభించిన అత్యున్నత మైన ఐ. ఏ. యస్. పదవిని సహితం త్రోసిరాజని తన జీవితాన్ని బాబా సేవకే అంకితం చేయటమేగాక బాబా తత్త్వాన్ని అత్యంత విపులంగా అందరికి అందించి తన శిష్యుల హృదయాలలో స్థిరనివాస మేర్పరచుకున్న ధన్యజీవి. వీరు రచించిన అనేక గ్రంథాలు హిందీ, ఇంగ్లీషు, తమిళ, కన్నడ భాషలలో సహితం ప్రచురింప బడినాయి. వీరు అర్ధశతాబ్ది కాలమే జీవించినా సాయి భక్తులకు అనేక జన్మలకు సరిపడా సాయి లీలామృతాన్ని అందించిన అమరజీవి. ఈనాడు

మాష్టారుగారు మన మధ్యనే ఉంటే స్వామీజీ సేవా తత్పరతను చక్కటి శైలిలో మరేగ్రంథానికీ సాటిలేని గ్రంథాన్ని మనకందించి ఉండేవారు. షిరిడీని దర్శించిన ఏభక్తుడికైనా షిరిడీ మహారాష్ట్రలోనిదా లేక ఆంధ్రప్రదేశ్‌లోని ఒక భాగమా అన్న అనుమానం కలగటం సహజం. దీనికి కారణం షిరిడీని దర్శించే భక్తులలో అత్యధిక శాతం ఆంధ్రులు కావటమే. దిన దినానికి పెరుగుతున్న ఆంధ్ర భక్తులను చూచిన స్వామీజీ తెలుగు వారు బాబాను ఆంధ్రరాష్ట్రం తీసుకు పోతారేమోనని అనుమానం కలుగుతుందని ఛలోక్తిగా అనే వారు. మన స్వామీజీ మరాఠి, హిందీ, తమిళం, కన్నడం, ఇంగ్లీషు, తెలుగు మొ॥గు భాషలు మాట్లాడ గలగటంతో సాయిలీలలను భక్తుల యొక్క మాతృభాషలో వివరించ గలిగేవారు. స్వామీజీ సాయి లీలలను వివరించేటప్పుడు తన్మయులై తమ కళ్ళెదుట కదలాడుతుంటే ప్రత్యక్షంగా చూచి దానిని వివరిస్తున్నారా అని పించేది.

ఎవ్వరైనా సాయిని చులకనగా మాట్లాడినా లేక సాయి తత్త్వాన్ని తప్పుగా వివరించినా వారితో వాదించి వారికి సాయి నిజతత్త్వాన్ని తెల్పి వారిని సాయి మార్గంలో నడిపించేవారు.

ఒక పర్యాయం ఆర్య సమాజానికి చెందిన ఒక వ్యక్తి విగ్రహారాధన కూడదని వాదిస్తూంటే, ఒక షాపుయజమాని మరి ఇద్దరు సంస్థాన్ ఉద్యోగులు అతని వాదాన్ని బలపరచ సాగారు. అంతలోనే స్వామీజీ అక్కడకు వెళ్ళి షాపు యజమానితో విగ్రహారాధన మంచిది కానప్పుడు బాబా పటాలు, విగ్రహాలు, లాకెట్లు ఎందుకమ్ము

తున్నావని ప్రశ్నించగా అతను నిరుత్తరు డయ్యాడు. బాబా సమాధి అన్ని సమాధుల వంటిదే అయితే దానిని దర్శించటానికి లక్షలాది మంది భక్తులు ఎందుకు షిరిడీకి వస్తున్నారు, బాబా విగ్రహాన్ని మలచే సమయంలో తాలిం (బాబా విగ్రహాన్ని మలిచిన శిల్పి) కు స్వప్న దర్శనం ఇవ్వలేదా? నేటికీ బాబా అనేక మంది భక్తులకు సశరీరులుగా దర్శనమిచ్చి వారిని బాధా విముక్తులను చేస్తున్నవైనం మీకు తెలియదా? అని సంస్థాన్ ఉద్యోగులను ప్రశ్నించగా వారు స్వామీజీ చెప్పిన నగ్న సత్యాలను ఖండించలేక మౌనం వహించారు.

స్వామీజీ వాగ్ధాటికి ముగ్ధుడైన ఆర్యసమాజానికి చెందిన వ్యక్తి, భగవంతుడు నిర్గుణ స్వరూపుడని వేదాలు చెపుతున్నాయి గదా, మరి అటువంటప్పుడు బాబా భగవంతుడా లేక భగవంతుని యొక్క అవతారమా? అని వినయంతో స్వామిని ప్రశ్నించగా స్వామీజీ "**బాబా జ్యోతిస్వరూపుడు నిర్గుణుడైన ఆ భగవంతుని సామాన్యులమైన మన మదిలో నిల్పి ధ్యానించ కష్టసాధ్యమని మనయందు కనికరించి మానవ శరీరంతో జన్మనెత్తి ఒక ఆకారాన్ని ధరించి ఆ రూపాన్నే మన మదిలోను హృదిలోను పదిలంగా నిలుపుకోవటానికే సాక్షాత్తూ ఆ పరబ్రహ్మమే సాయిగా అవతరించారు**" అని వివరించారు. ఎల్లపుడు ఒకే రూపాన్ని ధ్యానించటం మంచిదని ఆ రూపం మన మదిలో చిరస్థాయిగా నిలచి ధ్యానమార్గాన్ని సుగమం చేస్తుందని శలవిచ్చారు మన స్వామీజీ.

సాయి భక్తులు బాబా మందిరాలు నిర్మిస్తున్నామని గానీ మరికొంత మంది బాబా గ్రంథాలను ముద్రిస్తున్నామని ఆ కార్యక్రమం జయప్రదంగా జరగాలని స్వామిని ఆశీర్వదించ మంటే ''పొండి, పొండి బాబాకు చెప్పుకొండి అంతా ఆయనే చేయించు కుంటాడు, బాబాకు చెప్పుకొండి పొండి'' అనే వారు. స్వామీజీ వచనాలను సరిగా అర్థం చేసుకోలేనివారు స్వామి కసురుకుంటున్నారనుకునేవారు కానీ స్వామి దృష్టిలో సర్వం సాయినాథుడే అంతా ఆయనలోనే ఉంది, చేయించేదీ చేయించుకునేదీ కూడ సాయినాథుడే నని స్వామీజీ ప్రగాఢంగా విశ్వసించారని మనకర్థమవుతుంది.

స్వామీజీ కొంతమందిని ఆదరించి వారికి సాయి లీలలను వివరించి వారియందు సాయినాథుని భక్తి ప్రపత్తులు స్థిరంగా నిలిచేలాగ చేసేవారు. మరికొంత మందిని తన దగ్గరకు కూడ రానివ్వక ''పొండి, బాబా దగ్గరకు పొండి మీ కష్టాలను ఆయనకు చెప్పుకొండి ఆయనే మీ బాధలను తీరుస్తాడు'' అని కసురుకునే వారు. ఈ వ్యత్యాసాన్ని ఎందుకు చూపుతున్నారని స్వామీజీని ప్రశ్నించగా నిజమైన సాయి భక్తులకు తల్లి, తండ్రి, గురువు, దైవం సర్వం సాయే కాబట్టి తాను అట్లా చేస్తున్నానని చెప్పేవారు. నేడు షిరిడీకి వచ్చే యాత్రికుల సంఖ్య గణనీయంగా పెరగటానికి కారణం బాబా తమ కోర్కెలు తీరుస్తాడని, తమకు లాభాలను సమకూర్చి పెడతాడన్న నమ్మకంతోనే బాబా దర్శనానికి వస్తున్నారు. కాని వీరిలో చాల మందికి బాబా అంటే సరియైన అవగాహనే లేదు. అట్టివారు తన దగ్గరకు వచ్చి తమ గోడు వెళ్ళబోసుకుంటే ఏమీ లాభముండదని అందుచేతనే వారిలో తానలా

ప్రవర్తిస్తున్నట్లు తెల్పారు. తనకు కూడ సాయి తత్త్వంలో అ ఆలు మాత్రమే తెలుసునని సాయి భక్తులకు వాటినే నేర్పి సాయి యందు వారికి సరియైన అవగాహన ఏర్పడేటట్లు చేస్తే వారి బరువు బాధ్యతలను సాయినాథుడే చూసుకుంటాడని శలవిచ్చేవారు మన స్వామీజీ. సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపియైన సాయి తాను అల్లా సేవకుడననియు ''**సబ్ కా మాలిక్ అల్లా**'' అని చెప్పగా మనపూజ్య స్వామీజీ తాను సాయి సేవకుడినని ''**సబ్‌కా మాలిక్ సాయి**'' అని వచించే వారు.

స్వామీజీ ఎల్లప్పుడు సాయి సర్వాంతర్యామి, అంతటా, అందరిలోను, అన్నిటిలోను సాయి ఉన్నాడు. సాయి లేనిదే ఈ జగత్తులేదు అని చాటేవారు. ఒక వర్తకుడు షిరిడీలో షాపు పెట్టుకుని నష్టపోయాడు. అతను స్వామీజీ ద్వారకామాయిలో ఉండగా కోపంతో అక్కడకు వచ్చి ''సాయి సర్వాంతర్యామి, అంతటా ఉన్నాడు, అన్నిటిలోను ఉన్నాడు అని మీరు చెప్పుతున్నారు కదా! అది నిజమేనా! నిరూపించ గలరా?'' అని ఎంతో ఉద్వేగంతో ప్రశ్నించగా స్వామి అంతకంటే ఎంతో దృఢంగా ''అవును నిజమే'' అని సమాధాన మివ్వగా ఆ వచ్చిన వ్యక్తి చేతిలోగల ఖాళీ అగరు బత్తుల పాకెట్టును నేలపై విసిరి ''ఇందులో కూడా బాబా ఉన్నాడా? ఉంటే చూపించు'' అని స్వామికి సవాలు విసిరాడు. అగరుబత్తుల ప్యాకెట్టు నేలకు తగిలి కొంతదూరం జారి అందులోనుండి సాయిబాబా ఫోటో బయటకు వచ్చింది. ఇది చూచిన ఆ వ్యక్తి అచేతను డవ్వగా స్వామీజీ అతనిని ఓదార్చి సాయిని నమ్ముకున్న వారికి సాయి ఎన్నడూ అలక్ష్యం చేయడు. ఆయననే విశ్వసించు నీకు మేలు జరుగుతుందని చెప్పారు. అతను సాయి యందు

భక్తి విశ్వాసాలు కలిగి సేవించడం మొదలు పెట్టగా, అనతి కాలంలోనే అతని వ్యాపారం వృద్ధిచెంది లాభాలు గడించాడు. **''నా భక్తుల యిండ్లలో లేమి అన్న శబ్దమే వినబడదు''** అన్న అభయాన్ని మరొక సారి నిరూపించారు మన బాబా.

షిరిడీని దర్శించే భక్తులు అసంఖ్యాకంగా పెరగడంతో చావడిని ప్రతినిత్యం తెరచి ఉంచడం మొదలు పెట్టారు. సంస్థాన్ వారు స్వామీజీకి కొంత విశ్రాంతి కల్పించే ఉద్దేశ్యంతో చావడి బాధ్యత నుండి ఆయనను తప్పించారు. దాని తరువాత స్వామీజీ చావడిలో ప్రతినిత్యం ఉదయం, సాయంత్రం జరిగే భజన కార్యక్రమంలో పాల్గొనేవారు. ఉదయం భజనలు సమాధి మందిరంలో జరిగే అభిషేకానికి, పూజా కార్యక్రమాలకు అంతరాయం కలుగుతూందని సంస్థానం వారు తరువాత ఉదయం భజనలను ఆపివేశారు. సాయంత్రం భజన మాత్రం ప్రతినిత్యం స్వామీజీ మహాసమాధి చెందేవరకు కొనసాగింది. షుమారు రెండు దశాబ్దాలు ప్రతినిత్యం చావడిలో భజన కార్యక్రమాన్ని నిర్వహించారు మన స్వామీజీ.

స్వామీజీ ఎప్పుడూ భక్తికి మూడు మెట్లు అని అందులో మొదటిది పూజ, రెండవది భజన, మూడవది ధ్యానం అని చెప్పేవారు. ఏభక్తుడైనా పూజను నిర్వహించేటప్పుడు మనస్సును పూర్తిగా ఆ కార్యక్రమంలో నిమగ్నం చేయుటం కష్టం. భజనలో పాల్గొనే భక్తులు చాల వరకు నిమగ్నతను సాధిస్తారని తరువాత భగవంతుని గూర్చి సరియైన అవగాహన ఏర్పరచుకుని నిర్గుణ స్వరూపుడైన ఆ భగవంతుని

ఆరాధించడానికి ధ్యానం తోడ్పతుందని సెలవిచ్చేవారు. నిర్గుణ స్వరూపుడైన బాబా తన భక్తుల కోసం సాకార రూపాన్ని ధరించాడు కాబట్టి ధ్యానంలో ఎల్లప్పుడు ఒకే సాయి రూపాన్ని ధ్యానిస్తే మంచిదని వచించేవారు.

స్వామీజీకి భక్తులు ఎన్నోరకాల నైవేద్యాలను సమర్పించినా వాటన్నిటినీ బాబా భక్తులకు ప్రసాదంగా వితరణ చేసి బాబాకు సమర్పించిన నైవేద్యాన్ని మాత్రమే భుజించేవారు. సాయి వలెనే స్వామికూడ రుచులకు ప్రాధాన్యత నిచ్చేవారు గాదు. స్వామీజీకి ఎందరో భక్తులు మిఠాయిలు, పండ్లు, కొన్ని హోటళ్ళ నుండి ఉపాహారాలు, భోజన పళ్ళాలు పంపించేవారు. వాటి రుచినైనా చూడకుండా వాటన్నిటిని బాబా భక్తులకు పంచేవారు. స్వామీజీ లోనే సాయిని దర్శించి ఆయనకు సమర్పించిన ప్రతిదీ సాయికే చెందుతుందన్న దృఢ విశ్వాసంతో భక్తులు ఎన్నో కానుకలను స్వామికి సమర్పించేవారు. వాటన్నిటిని సాయి భక్తులలో సాయినే గాంచి వారికి సమర్పించేవారు స్వామీజీ. స్వామీజీని దర్శించిన ఏ భక్తునీ రిక్త హస్తాలతో వెళ్ళనిచ్చేవారు కాదు. వారికి బాబా ప్రసాదం, తీర్థం, పండో, ఫలమో లేక సాయి చిత్రపటాలో, సాయి గ్రంథాలో ఏదో ఒకటి బహూకరించేవారు. ప్రతినిత్యం హోటళ్ళ నుంచి భోజనం తెచ్చే పిల్లలకు సహితం స్వామి ఏదో ఒకటి ప్రసాదించే వారు.

స్వామీజీ ఎల్లప్పుడు తాను సాయికి, సాయి భక్తులకు సేవకుడనని వినమ్రతతో విన్నవించేవారు. స్వామీజీ నిరాడంబరత వారి

నిస్వార్థ సాయి సేవ, వారి అకుంఠిత సాయి దీక్షకు, వారికి భగవంతుని పై గల అవగాహనకు, వారి సంస్కారానికి, వారికి గల వేదజ్ఞానానికి ప్రణమిల్లి వారిని గౌరవ ప్రపత్తులతో **''బాబా'' ''గురుదేవ్'' ''స్వామీజీ''** అని సంబోధించేవారు. విద్యావంతులు, నిరక్షరాస్యులు, ధనవంతులు, అతిబీదవారు, పెద్దలు, పిన్నలు ఉన్నత పదవులలో ఉన్నవారు, వ్యాపార వేత్తలు, పారిశ్రామిక వేత్తలు, రాజకీయ వేత్తలు, డాక్టర్లు, లాయర్లు మొ॥ అనేక వృత్తులలో, వ్యాసకాలలో గలవారు స్వామీజీకి భక్తులయ్యారు. స్వామీజీ దృష్టిలో సర్వులూ సమానమే. స్వామీజీ వారికి సాయియందు ఎంతభక్తి ఉన్నదని మాత్రమే అన్వేషించేవారు. వారి దృష్టిలో ధనికులు, బీదవారు, ఉన్నత పదవులలో ఉన్నవారు అతిసామాన్యులు అందరూ సమానమే. అందరిని ఒకే తీరున ఆదరించే వారు. ఆయనను దర్శించే ప్రతి భక్తుని తోను **''మనందరికి సర్వం సాయి నాథుడే ఎట్టి విపత్తు సంభవించినా ఆయనయందు విశ్వాసాన్ని సడలించకండి, సాయి నామమే మనకు శ్రీరామ రక్ష''** అని సాయి నాథుని గురించి బోధించేవారు.

## భక్తోద్ధారుకుడు మన స్వామీజీ :

మన పూజ్య శ్రీ శివనేశన్ స్వామీజీ దేశ విదేశాలలో గల అనేక మందిని సాయి భక్తులుగా మార్చి వారిని ఉద్ధరించారు. వీరందరి గురించి క్లుప్తంగా ప్రస్తావించినా గాని గ్రంథం అతి విస్తార మవుతుందన్న తలంపుతో స్వామీజీ ఆశీస్సులతో తమ సర్వస్వాన్ని సాయికే అంకితం చేసిన ఇరువురి భక్తులను గురించి మాత్రం మీకందించకపోతే ఈ గ్రంథం అసంపూర్ణ మవుతుందన్న తలంపుతో స్వామీజీ కరుణా

కటాక్షములతో తమ జీవిత గమ్యాలనే మార్చుకున్న శ్రీ అయోధ్య గారిని గురించి కుమారి క్రిస్టియానా( ఓం సాయి) (కాలిఫోర్నియా వాసి) గురించి మాత్రం ఈ గ్రంథంలో పొందు పరుస్తున్నాను.

అయోధ్యగారు అతి పిన్న వయస్సులోనే భగవత్ కృపను పొంది బ్రహ్మచారి జీవితాన్ని గడుపుతూ పుణ్య క్షేత్రాలను, అవధూతలను దర్శిస్తూ ప్రస్తుతం స్వామీజీ ఆశీస్సులతో నిర్మించ బడిన శ్రీ దత్తవెంకట సాయి సేవా సమాజం, దత్తగఢ్- కల్లూరు- 504 109, ఆదిలాబాద్ జిల్లా, ఆంధ్రప్రదేశ్ నందు తపస్సుకొనసాగిస్తున్నారు. శ్రీ అయోధ్యగారు స్వామీజీతో షిరిడీలో కొంతకాలం ఉండి స్వామీజీ ద్వారా సాయి తత్త్వాన్ని ఆకళింపు చేసుకొని స్వామీజీ అకుంఠిత సాయి సేవా తత్పరతను గాంచి ఆయన సూచించిన మార్గంలో పయనిస్తున్న పుణ్యమూర్తి.

కుమారి క్రిస్టియానా( ఓం సాయి) కాలిఫోర్నియాకు చెందిన విదేశీ విద్యార్థిని. ఈమె సాయిని స్వప్నంలో గాంచి ఆయన ఆజ్ఞమేరకు భారతదేశానికి వచ్చి షిరిడీ సాయి సేవలో ఎనిమిది సంవత్సరాలు గడిపి 1996లో స్వామీజీ సమాధి అనంతరం తన స్వదేశానికేగిన ధన్యజీవి. ఈమె యొక్క మంచి మనసెరిగిన స్వామీజీ ఆమెను చేరదీసి సాయి తత్త్వాన్ని ఆసాంతము ఆస్వాదింప జేసి ఆమె హృదయంలో సాయికి స్థిరనివాస మేర్పరచారు. ఈమెకు స్వామీజీ బాబా అష్టోత్తర శతనామావళి, బాబా భజనలు కంఠపాఠంగా నేర్పించారు. ఈమె ఉన్మత్తురాలు వలె షిరిడీలో తిరుగుతున్న రోజుల్లో ఆమెలోని భక్తి

తత్పరతను గాంచిన స్వామీజీ ఆమెను చేరదీసి కన్న కూతురువలె ఆదరించారు. ఈమె తనను ఎవ్వరైనా అనాదరించినా, ఆదరించినా గానీ ''ఓం సాయి'' అని సమాధాన మిచ్చేది. ఎల్లప్పుడు ''ఓం సాయి'' అనటం వల్ల ఈమెను అందరూ ''ఓం సాయి'' అని పిలిచేవారు.

ఈమె తన స్వదేశం వెళ్ళి పోతుందని ఈమె దర్శనార్థం జనం గంటల తరబడి వేచి ఉంటారనియు, ఈమె అమెరికా దేశంలో సాయి బాబాను గురించి విస్తృత ప్రచారం జరుపుతుందని స్వామీజీ జోస్యం చెప్పారు.

ఈమె విదేశీ వనిత యైనప్పటికి వస్త్రధారణ యందు శ్రద్ధమూపేది కాదు, శరీర పోషణ యందసలే శ్రద్ధ వహించేది కాదు. ఎల్లప్పుడు మురికి బట్టలను ధరించి ''ఓం సాయి'' అంటూ షిరిడీ వీధుల్లో తిరిగేది. మనస్సును మాత్రం ఎల్లవేళలా సాయి యందే లగ్నం చేసేది. ఈమె షిరిడీకి 1988లో వచ్చి 1996 వరకు అంటే ఎనిమిది సంవత్సరాలు మాత్రం నివసించి తన హృదినిండా సాయినే నిల్పుకొని తన స్వదేశానికి చేరుకొంది.

## భక్తుల అనుభవాలు :

సాయి నిస్వార్థ సేవలో నాలుగున్నర దశాబ్దాలు గడిపిన మన స్వామీజీ సాయి అనుగ్రహంతో అనేక సాయి భక్తులకు ఎన్నో రకాలుగా చేదోడు వాదోడుగా నిలిచి వారిని సాయి పథంలో నడిపించి భుక్తి, భక్తి, ముక్తి మార్గాలను చూపిన పుణ్యమూర్తి. బాబా తన భక్తుల

మనోవాంఛల నెరింగి వారి వాంఛల నీడేర్చినట్లే మన స్వామీజీ కూడా తమ ఆప్తుల మనొస్సెరిగి వారడుగక ముందే వారి మనోవాంఛల నీడేర్చేవారు.

ఒక శీతకాలంలో ఒకనాటి రాత్రి శ్రీ మోహన్ బాబా అనే స్వామి భక్తుడు గురుస్థానంలో కూర్చొని చలికి వణుకుతూ వేడిగా టీ తాగుదామంటే డబ్బులేక అతను మనసులోనే స్వామి దగ్గర టీ కూపన్లు ఉన్నాయి. తనకు ఒకటి ఇస్తే ఆయన సొమ్మేం పోతుంది అనుకున్నాడు. రెండు మూడు నిమిషాలలోనే స్వామీజీ మోహన్‌బాబాను తన గదిలోనికి పిలిచి చేతికి వచ్చినన్ని టీ కూపన్లు తీసి అతని కిచ్చారు. తన మనసులోని కోర్కె స్వామీజీ ఎలాగ్రహించ గలిగారూ లేక కాకతాళీయమా అన్న సందేహంతోనే టీ కూపన్లు తీసుకుని టీ త్రాగి గురుస్థానానికి వచ్చి స్వామీజీ తన మనొస్సెరింగిన వారైతే ఆయన దగ్గర ఉన్న శాలువాలలో ఒక శాలువాను తన కివ్వాలని అనుకున్నాడు. అనుకున్న వెంటనే స్వామీజీ అతనిని పిలిచి ''నీకు కావలసిన శాలువా తీసుకో ఇవన్నీ నీవే'' అనగా మోహన్ బాబా స్వామీజీ తన మనోవాంఛను తెలుసుకో గలిగారని గ్రహించి ఒక శాలువను తీసుకుని ఆయనకు నమస్కరించాడు.

శ్రీ కె. సుబ్రహ్మణ్యం (మణి) కు 1964లో స్వామీజీతో పరిచయ భాగ్యం కలిగింది. ఆ పరిచయం వృద్ధిచెంది 1971 నుంచి మణిస్వామి శిష్యులలో ఒకరైనారు. స్వామీజీ ఆదేశానుసారం 1980లో బొంబాయిలో గల తన వ్యాపారాన్ని విడనాడి షిరిడీలో నివసించ

సాగారు. స్వామీజీనే తన గురువుగా భావించి ఆయన ఆజ్ఞానుసారం జీవించ సాగారు. ఒక నాటి రాత్రి శేజ హారతి అయిన తరువాత ద్వారకామాయిలో కూర్చొని స్వామీజీ తన గురువైతే 5 నిమిషాలలో స్వామీజీ తనకు 10 పైస లివ్వాలని, అలా జరిగితే స్వామిని త్రికరణ శుద్ధిగా తన గురువుగా కొలుస్తానని మనసులో అనుకున్నారు. 5 నిమిషాల కంటే ముందుగానే స్వామీజీ అతని చేతిలో 10 పైసల నాణెం ఉంచి ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయారు. సద్గురు వెప్పుడు తన శిష్యుని మనోగతాన్నెరిగి అతని కోర్కెలను తీరుస్తారు. పై సంఘటనల వలన స్వామీజీ మన అంతర్యామి అని సుస్పష్ట మవుతుంది.

శ్రీ రామచంద్ర దేశ్‌ముఖ్ అనే 70సం॥ల షిరిడీ నివాసి స్వామీజీ యందు అత్యంత భక్తి శ్రద్ధలు గల భక్తుడు. స్వామీజీలోనే సాయిని చూచుకొని ఆయననే బాబాగా భావించిన భాగ్యశాలి. శ్రీ రామచంద్ర దేశ్‌ముఖ్ తల్లిదండ్రు లిద్దరూ సాయిని సేవించి తరించిన భక్తులే. శ్రీ రామచంద్రకు మాత్రం సాయి యందు ఏమాత్రం నమ్మక లేదు. ఇతని కుమార్తెకు 1961 సం॥ టైఫాయిడ్ జ్వరం రాగా షిరిడి సాయి ఆసుపత్రిలో చేర్పించి చికిత్స చేయించగా నెలరోజులు గడచినా గాని జ్వరం తగ్గక పోవటంతో అక్కడి వైద్యులు తమవల్ల కాదనియు పెద్ద ఆసుపత్రిలో చూపించమని చెప్పి ఆమెను ఆసుపత్రి నుంచి పంపి వేసారు. దేశ్‌ముఖ్‌కు ఏమి చేయటానికి పాలుపోక స్వామిని ఆశ్రయించగా స్వామీజీ బాబా తీర్థాన్ని, ఊదీని మాత్రం ఇవ్వమని మిగిలిన మందులన్నీ మానివేసి బాబా పై భారం వేసి వేడుకోమని సలహా నిచ్చారు. ఆ పాపకు బాబా తీర్థాన్ని, ఊదీని ఇవ్వగా అందరికీ

ఆశ్చర్యం కలిగే రీతిన అతిత్వరలో ఆరోగ్యవంతు రాలైనది. దీనితో దేశ్‌ముఖ్‌కు బాబా యందు గురి కుదిరి స్వామీజీ ద్వారా బాబా లీలలను తెలుసుకొని బాబా భక్తునిగా మారాడు. స్వామీజీ అతనికి చేసిన మేలు మరువక "**స్వామీజీయే నా సాయి బాబా**" అని అందరికి చెప్పేవాడు. ఇతనికి సాయి యందు భక్తి పెరిగే కొలది ఇతనిని సాయినాథుడే కష్టాల నుంచి గట్టెక్కించి రక్షించేవాడు. ఇతని తల్లిగారు ప్రతినిత్యం ఉదయం 3 గంటలకే నిద్రలేచి స్నానం చేసి సాయిపూజతో తన దైనందిన కార్యక్రమాన్ని ప్రారంభించేవారు. 1964 సంవత్సరంలో ఒక రోజున ఎప్పటి వలె వేకువ జామునే నిద్రలేచి స్నానం చేయటానికి బావి దగ్గరకు వెళ్ళి కాలు జారి బావిలో పడిపోయింది. ఆ సమయంలో మిగిలిన కుటుంబ సభ్యులంతా గాఢ నిద్రలో ఉండుటచే ఈ ప్రమాదాన్ని పసిగట్టలేదు. తెల్లవారిన తరువాత బావిలోంచి సన్నటి మూలుగు వినిపించి వెళ్ళిచూచి అతి ప్రయాసతో ఆమెను బయటకు తీసారు. బావిలో పది అడుగుల పైనే నీరు ఉన్నప్పటికీ ఆమె కంఠం వరకు మాత్రమే తడవటం చూచి అందరూ ఆశ్చర్యపోగా తాను నూతిలో పడే సమయంలో "బాబా" అని పిలవగా బాబా తనను నీటిలో మునగ కుండ క్రింద నుంచి పట్టుకొని కాపాడినట్లు వివరించింది. "**నా సమాధి నుండి యేం నా భక్తులను సంరక్షిస్తాను**" అన్న బాబా అభయ హస్తాన్ని మనందరకు స్పురణకు తెస్తున్నది ఈ సంఘటన. దీని తరువాత శ్రీ దేశ్‌ముఖ్‌కు బాబా యందు ప్రగాఢ విశ్వాసం ఏర్పడి బాబాకు అంకిత భక్తుడుగా మారినాడు.

1975వ సంవత్సరములో శ్రీ దేశ్‌ముఖ్ తన కుమార్తె వివాహం చేయ తలపెట్టి స్వామీజీ ఆశీర్వాదాన్ని కోరగా స్వామీజీ అతనితో ''నీ కుమార్తెతో బాబా సచ్చరిత్ర పారాయణము చేయించు, పారాయణము ముగిసే లోపే మగ పెండ్లివారు తామంతట తామే వచ్చి నీ కుమార్తెను వారి కుమారునికిచ్చి వివాహం చేయమని అడుగుతారు'' అని చెప్పగా సరిగ్గా అదే విధంగా పారాయణము ముగిసేలోపే ఆమె వివాహం నిశ్చయమైంది. వివాహానికి మగ పెండ్లి వారు చెప్పిన దానికంటే రెండురెట్లు అధికంగా రావటంతో చేసిన వంటకాలు చాలవన్న భయంతో శ్రీ దేశ్‌ముఖ్ స్వామీజీ సలహాను కోరగా స్వామీజీ అతనితో అన్ని వంట పాత్రలలోను ఊదిని వేసి గుడ్డ కప్పి గుడ్డను పూర్తిగా తొలగించకుండా వడ్డించమని చెప్పగా వారు అలాగే చేసి అందరి భోజనాలు పూర్తి అయిన తరువాత చూస్తే వండిన వంటకాలన్నీ అలాగే ఉన్నాయి. స్వామీజీ సలహా ప్రకారం వాటిని ద్వారకామాయి దగ్గర బిచ్చగాళ్ళకు వితరణ చేసారు.

ఒక పర్యాయం శ్రీ దేశ్‌ముఖ్ ద్వారకామాయిలో బాబాకు నైవేద్యం సమర్పిస్తుండగా తన ఇంటికి ఎవ్వరో వెళ్ళినట్లు అనుభూతి కలిగింది. సరిగ్గా అదే సమయంలో ఫకీరు వేషధారియైన 18సం॥ యువకుడు దేశ్‌ముఖ్ ఇంటికి వెళ్ళి భిక్ష నర్థించగా దేశ్‌ముఖ్ భార్య తన భర్త బాబాకు నైవేద్యం సమర్పించటానికి ద్వారకామాయికి వెళ్ళారని ఆయన రాగానే భోజనం పెడతానని చెప్పగా ఆ యువకుడు

తనకు అంత సమయం లేదని వారు భోజనం చేసే పళ్ళెం ఇస్తే దానిమీద తన పేరు వ్రాసి ఇస్తాననగా ఆమె పళ్ళెం ఇవ్వగా ఆ యువకుడు ఆ పళ్ళెం మీద స్వస్తిక్ గుర్తు, ఓం, తాబేలు, చేపను తన గోటితో చిత్రించి వెళ్ళిపోయాడు. దేశ్‌ముఖ్ ద్వారకామాయి నుంచి తిరిగి వచ్చి జరిగినది తెలుసుకుని ఆ వచ్చిన యువకుడు బాబాయే నని గుర్తించి ఆ పళ్ళాన్ని బాబా ప్రసాదంగా భావించి పూజలో ఉంచుకొని పూజించ సాగారు ఆ కుటుంబ సభ్యులు. కాని దురదృష్ట వశాత్తు వారింట్లో దొంగతనం జరిగినప్పుడు ఆ పళ్ళాన్ని కూడ దోచుకు పోయారు దొంగలు. స్వామీజీ ఆశీస్సులతో శ్రీ దేశ్‌ముఖ్ అతని కుమారుని వివాహాన్ని 1993వ సంవత్సరములో స్వామీజీ షిరిడీ సాయి సేవలోనలుబది వసంతాలను పూర్తి చేసిన సందర్భాన్ని పురస్కరించుకొని స్వామీజీ జన్మదినమైన 12-4-1993న స్వామీజీ మరియు సాయి భక్తుల సమక్షంలో ఘనంగా జరుపగలిగాడు. స్వామీజీ గురువు గారు శ్రీ ముత్తయ్య గారు షిరిడీలో ఉన్నప్పుడు కొద్దిరోజులు శ్రీ దేశ్‌ముఖ్ ఇంట్లోనే ఉన్నారు.

స్వామీజీ సాయి సేవలో నలుబది సంవత్సరాలు పూర్తిచేసిన సందర్భాన్ని పురస్కరించుకొని భక్తులు ఒక కార్యక్రమాన్ని ఏర్పాటు చేసి స్వామిని సత్కరింప తలపెట్టి స్వామీజీ అనుమతి కోరగా నిరాడంబరుడైన స్వామీజీ వారి కోర్కెను సున్నితంగా త్రోసిపుచ్చారు. కాని భక్తులు మరీ మరీ వేడుకోగా భక్తుల కోర్కెను మన్నించి శ్రీ దేశ్‌ముఖ్ గృహంలోనే అదేరోజు అతని కుమారుని వివాహాన్ని జరిపించటానికి అంగీకరించారు. 12-4-1993న స్వామీజీ పేరు మీద

శాంతి జరిపి ఆయన ఆయుషు అభివృద్ధికి 21 రకాలైన పూజలు చేయించారు. స్వామీజీ ఆ రోజు సాయంత్రం శ్రీ దేశ్‌ముఖ్ గృహానికేగి నూతన వధూవరులను, భక్తులను ఆశీర్వదించి వచ్చారు.

ముంబయి నివాసి శ్రీమతి జరినాతారాపూర్‌వాల స్వామీజీని "**గురుదేవ్**" అని ఎంతో గౌరవ ప్రదంగా సంబోధించేవారు. ఈమెకు స్వామీజీ యందు ఎనలేని గౌరవ మర్యాదలు, భక్తి గలదు. స్వామీజీ మాట ఈమెకు వేదవాక్కు. స్వామీజీ ఆజ్ఞలేనిదే ఏ పని చేపట్టేది కాదు. ఈ గ్రంథం మీ పవిత్ర హస్తాలలో ఉందంటే దానికి కారణం శ్రీమతి జరినాతారాపూర్‌వాలా గారేనని "మనవి" లోనే మీకు సవినయంగా విన్నవించుకున్నాను. ఈమెకు సాయి బాబా మరియు మన పూజ్య స్వామీజీ అనేక లీలలను ప్రదర్శించారు. వాటిలో అతి ముఖ్యమైనవి మాత్రం మీకందిస్తున్నాను.

శ్రీమతి జరినా గారు ఆమె తల్లిదండ్రుల జ్ఞాపకార్థం 'మెహర్-ధన్' అనే ట్రస్టును స్థాపించి సాయి తత్త్వాన్ని తెలిపే అనేక గ్రంథాలను, హారతి క్యాసెట్లు మొ॥వి అతి సుందరంగా తయారుచేసి విడుదల చేసారు. స్వామీజీ ఆశీర్వాద బలమే తనతో ఈ పనులు చేయించ గలిగినట్టు సవినయంగా మనవి చేసుకున్నారామె.

బాబా ఆరతి క్యాసెట్ల మాస్టరు క్యాసెట్టును తయారు చేసి స్వామీజీకి వినిపించి ఆయన అభిప్రాయము, ఆశీర్వాదము పొందిన తరువాత విడుదల చేయాలని నిర్ణయించుకొని క్యాసెట్లనూ, టేపురికార్డరును స్వామీజీ రూముకు తీసుకు వెళ్ళగా క్రిష్టియాన

అభ్యంతర పెట్టగా స్వామీజీ అదేరోజు (16-4-1993) రాత్రి శ్రీమతి జరినా నివాసానికి వెళ్ళి ఆ క్యాసెట్లను విన్నారు. ఒక క్యాసెట్టులో అర్థం వరుస క్రమం మారటం గమనించిన స్వామి దానిని సరియైన వరుస క్రమంలోకి మార్చి విడుదల చేయమనగా అప్పటికే మాస్టరు క్యాసెట్టు తయారైనదని మార్చటం సాధ్యం కాకపోవచ్చని శ్రీమతి జరీనా చెప్పగా స్వామీజీ వరుస క్రమాన్ని మార్చటం వీలవుతుందని క్యాసెట్టు రికార్డింగు, ఎడిటింగు విధానాన్ని విశదపర్చగా అక్కడున్న శ్రోతలంతా స్వామీజీకి గల ఆధునిక సాంకేతిక పరిజ్ఞానానికి అచ్చెరు వొందారు.

అవధూత శ్రీ రామిరెడ్డి తాత క్యాసెట్టు వినటానికి కూడ మరొక పర్యాయం స్వామీజీ శ్రీయుతులు మణి, మోహన్ బాబా, సియారాం మొ॥ భక్తులతో శ్రీమతి జరీనా ఇంటికి వెళ్ళగా ఆ రోజు టేపు రికార్డరు పనిచేయక పోవటంతో శ్రీమతి జరీనా స్వామీజీ తన గృహానికి వచ్చిన సందర్భాన్ని సద్వినియోగ పరచుకో దలచి స్వామీజీకి పాద పూజ చేసి తరించారు. భక్తుడు భగవంతునికోసం దేవాలయానికి వెళ్ళి దేవుని దర్శిస్తాడు కానీ ఆ దేవుడే భక్తురాలిని వెతుక్కుంటూ వస్తే ఆమె ఆనందాన్ని వర్ణించ ఎవ్వరి తరము!

ఈమె 1992లో షిరిడీలో ఒక ఆశ్రమాన్ని నిర్మించ దలచి స్వామీజీ ఆశీస్సులు కోరగా స్వామీజీ ''బాబాను వేడుకోండి ఆయన ఆశీర్వదిస్తే అంతా సవ్యంగా జరుగుతుంది'' అని సెలవిచ్చారు. ఆ రోజు 1992 డిసెంబరు మాసం 11వ తేది అయోధ్యలో రామ

మందిరం అల్లర్ల వల్ల షిరిడీకి వచ్చే భక్తుల సంఖ్య అనూహ్యంగా తగ్గిపోయి షిరిడీ నిర్మానుష్యంగా తయారైంది. అదే రోజు స్వామీజీ ఆజ్ఞ ప్రకారము శ్రీమతి జరీనా స్థల సేకరణకు సమాధి మందిరంలోను, ద్వారకామాయిలోను ప్రార్థించి చావడిలో భజనకు హాజరై ఒక పూలహారాన్ని కొని గురుస్థానంకు రాగా జన సందోహం లేక పోవటంతో గురుస్థానాన్ని శుభ్రం చేస్తున్న అర్చకుడు ఆమెను కొద్ది సేపు వేచి ఉండమనగా ఆమె అక్కడనే బాబాను స్థల సేకరణ కొరకు ప్రార్థిస్తూ ఉండగా ఉధృతంగా గాలివీచి వేపాకులు విపరీతంగా రాలి గురుస్థాన మంతా వేపాకులతో నిండిపోయింది. రెండు, మూడు నిమిషాలలోనేగాలి తగ్గి ప్రశాంత వాతావరణం ఏర్పడింది. ఇది చూచిన గురుస్థాన్ పూజారి శ్రీమతి జరీనాతో ''నీ ప్రార్థన బాబా ఆలకించారు, నీ కోరిక తప్పకనెరవేరుతుంది'' అని చెప్పారు. బాబాకు పూలమాల సమర్పించి వెంటనే స్వామీజీ దగ్గరకు వెళ్ళి ఈ విషయం చెప్పగా స్వామీజీ బాబా ఆశీర్వదించారు నిరాటంకంగా స్థల సేకరణ జరుగుతుందని సెలవిచ్చారు.

1993 ఆగస్టు 10వ తేదిన శ్రీ మణి సమక్షంలో ఏ స్థలం ఆశ్రమం కోసం క్రయం చేయాలో స్వామీజీని అడగగా స్వామీజీ బాబాను ప్రార్థించండి ఆయనే మీకు ఏ స్థలం తీసుకోవాలో సూచన లిస్తాడు అనగానే స్వామీజీ రూములో గలగణపతి విగ్రహం వద్ద పెట్టిన పుష్పం రాలి పడింది. శ్రీమతి జరీనా దానిని తీసి స్వామీజీ పాదాల వద్ద ఉంచగా ఆయన ''ఇది బాబా నీకిచ్చిన ప్రసాదం నీవే తీసుకో'' మని ఆ పుష్పాన్ని ఆమెకు ఇచ్చారు.

1993 ఆగస్టు మాసం 13వ తేదీన రెండు, మూడు స్థలాల వివరాలను సేకరించి శ్రీమతి జరీనా ఏ స్థలాన్ని తీసుకొనమంటారని స్వామీజీని అడుగగా బాబా దగ్గర చీటీలు వేసి బాబా చెప్పిన స్థలాన్ని తీసుకొనమని చెప్పగా చీటీలు వేస్తే శ్రీ సంపత్ కాకా స్థలాన్ని తీసుకొనమని రాగా ఆ స్థలాన్నే (6 ఎకరాలు) క్రయం చేసారు. 17-4-93న అగ్రిమెంటు వ్రాయించుకొని బాబాకు అత్యంత ఇష్టమైన రోజు వున స్వామీజీ జన్మదినమైన శ్రీరామనవమి పర్వదినాన(20-4-1994) రిజిస్ట్రేషను చేయించారు. ఈ స్థలాన్ని సంపత్ కాకా పూర్వీకులు బాబా లీలలను హరికథా రూపంలోనూ, కీర్తనల ద్వారాను దేశం నలుమూలల ప్రచారము గావించి బాబాను గూర్చి ప్రథమంగా తాను రచించిన కొన్ని పౌరాణిక గ్రంథాలలో బాబా లీలలను ప్రచురించిన శ్రీ దాసుగణు మహారాజుకు బహూకరించ దలచారు. కాని అది జరిగే లోపే శ్రీ దాసుగణు మహారాజు పరమపదించటంతో వారి కోర్కెను ఈవిధంగా నెరవేర్చాడు బాబా. ఓం సాయి (క్రిస్టియానా) ఆశ్రమం పేరు ''శ్రీ శివనేశన్ స్వామీజీ ఇన్స్టిట్యూట్ ఆఫ్ హైయర్ ఎడ్యుకేషన్'' అని దానిని సంస్కృతంలో వ్రాయాలని శ్రీమతి జరీనాను కోరింది. 8-12-1993న తేదీన స్వామీజీ 27-12-1993 మంచిరోజు, ఆరోజున భూమి పూజ చేయించమని శ్రీమతి జరీనాను ఆదేశించారు. అదేరోజు సాయంత్రం శ్రీమతి జరీనా ధుని పూజ చేయించుతుండగా ఒక పురోహితుడు కొబ్బరికాయ నిచ్చి బాబా ప్రసాదంగా స్వీకరించ మన్నాడు. బాబా

ఆశీస్సులు కూడ లభించాయని సంతసించి స్వామీజీ ఆజ్ఞ ప్రకారం 27-12-93న ఉత్తరప్రదేశ్ కు చెందిన ఆచార్య వాగేష్‌ను షిరిడీకి పిలిపించి నాసిక్ నివాసియైన శ్రీరామానంద బాబా సమక్షంలో భూమిపూజ జరిపించారు. పూజ సమయానికి స్వామీజీ శ్రీ నాందేడ్‌కర్ ద్వారా కొబ్బరికాయ, పూలు, పళ్ళు, ప్రసాదం పంపించి తమ ఆశీర్వాదాన్ని తెలియ జేసారు. స్థలాన్ని స్వామీజీ పేరున రిజిస్ట్రేషను చేయించటానికి అనుమతి వేడగా''నాకు ఏ విధమైన ఆస్తులు వద్దు, నా ఈ జీవితం అతి నిరాడంబరంగా బాబా సేవలో గడిచి పోవాలి'' అని వారి కోర్కెను సున్నితంగా తిరస్కరించారు.

శ్రీమతి జరీనాకు అన్నిటి కంటే ముఖ్యమైనది జన్మజన్మలకు మరువలేని మరొక అద్భుత లీలను స్వామీజీ ప్రసాదించారు. ఇది చదివిన, మీరు కూడ స్వామీజీ ఎంతటి మహిమాన్వితులో గ్రహించగలరు.

శ్రీమతి జరీనా గృహం (నట-షాహి, 69సి, ఓర్లీ, సీ ఫేస్, ముంబయి - 400 025) లో 23-9-1993న ఈ అద్భుత సంఘటన జరిగింది. సముద్ర తీరానికి అతి సమీపాన ఉండటం వల్ల కిటికీలు తెరిచి ఉంచితే వర్షాకాలంలో వర్షపునీరు ఇంటిలోపలికి వచ్చేది. ఆ కారణంగా ఆమె ఎల్లప్పుడు కిటికీ తలుపులు మూసి ఉంచేవారు. కానీ ఆరోజున ఆమె పూజ ముగించుకొని స్వామీజీ విగ్రహానికి నైవేద్యం, నూతన వస్త్రాలను సమర్పించిన తరువాత 16 X 14 అడుగుల వైశాల్యంగల ఆ గది కిటికీలను మూయటం మర్చిపోయారు. స్వామీజీ పంచలోహ విగ్రహం కిటికీకి అతి దగ్గరలో గలదు. అది వర్షాకాలం

కావటంతో ఆరోజు ఈదురు గాలులతో విపరీతమైన వర్షం కురిసి తెరిచి ఉంచిన కిటికీ ద్వారా వర్షపు నీరు గదిలోకి ప్రవేశించి గదిలో షుమారు రెండు అంగుళాల మేరకు నిలిచింది. ఆ గదిలో గల గ్రంథాలన్నీ వర్షానికి తడిసినవి గాని కిటికీకి దగ్గరనే గల స్వామీజీ విగ్రహం మీదగాని స్వామీజీకి సమర్పించిన నూతన వస్త్రాలమీద గాని ఒక్క చుక్క నీరు కూడ పడక పోగా కనీసం చెమ్మకూడ తగల్లేదు. వింతలలోనే వింతయైన ఈ వింతను గాంచిన శ్రీమతి జరీనా అదంతా స్వామీజీ లీలయని గ్రహించారు. ఈ లీలను పఠించిన పాఠకులు స్వామీజీ వింతటి మహిమాన్వితులో గ్రహించేయుందురు. శ్రీమతి జరీనా ఈలీలను ''గురుదేవుని లీల'' యని వర్ణించారు.

ఒకరోజు శ్రీమతి జరీనా స్వామీజీ ఏవైనా బాబాను గురించిన ఇంగ్లీషు గ్రంథాలనిస్తే చదువుకోటానికి బాగుంటుందనుకోగా ఆమె మనస్సులోని కోర్కెను గ్రహించిన స్వామీజీ ఆమెకు నాలుగు ఇంగ్లీషులో ప్రచురించిన గ్రంథాలను బహూకరించారు.

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ గారు రచించిన సాయిబాబా గ్రంథాలను షిరిడిని సందర్శించే సాయి భక్తులకు అందించాలన్న సదుద్దేశ్యంతో స్వామీజీ ఆశీస్సులు పొంది లెండీబాగ్‌కు సమీపాన మెయిన్ రోడ్డులో ఒక షాపును తీసుకొని దానికి శ్రీ పి. సాంబశివరావు (పి.యస్.రావు) గారిని మేనేజరుగా నియమించారు. శ్రీ రావు స్వామీజీ యందు అకుంఠిత విశ్వాసం గలవారు. వీరు ప్రతినిత్యం స్వామీజీ సమక్షంలో సద్గ్రంథ పారాయణము గావించే వారు.

వీరెప్పుడూ స్వామీజీ ఒక్కసారైనా తమ పవిత్ర పాదంతో షాపును పునీతం చేస్తే బాగుంటుందని మనస్సులో తలచే వారు. ఒక రోజు ఉదయమే షాపు తెరిచి అగరుబత్తులు వెలిగించి, దీపారాధన చేసి ప్రక్కకు తిరిగి చూడగా షాపులో స్వామీజీ దర్శన మివ్వగా శ్రీ రావు ఆనందంతో స్వామీజీకి పాదాభి వందనం చేసి తలెత్తి చూడగా స్వామీజీ అంతర్థాన మయ్యారు. శ్రీ రావు ఈ విషయాన్ని స్వామీజీకి వివరించగా స్వామీజీ తాను రాలేదనియు బాబాయే తన రూపంలో వచ్చి ఉంటారనియు వివరించారు.

మరొక పర్యాయం జర్మనీ దేశం నుంచి ఒక సాయి భక్తుడు షిరిడీకి రాగా స్వామీజీ అతనిని తీసుకొని భరద్వాజగారి బుక్‌స్టాలుకు వచ్చి ''సాయిబాబా ది మాస్టర్'' అన్న గ్రంథాన్ని కొని ఆ విదేశీయుడికి బహూకరించారు. ఈ రీతిన స్వామీజీ శ్రీ రావు మనోవాంఛ నీడేర్చారు.

## స్వామీజీ వివరించిన సాయి లీలలు :

స్వామీజీ బాబా పాద ధూళితో పరమ పవిత్రతను సంతరించుకున్న షిరిడీ ధరిత్రిపై కాలిడినది మొదలు దేహత్యాగం చేసే చివరి ఘడియ వరకు కోటానుకోట్ల సాయి లీలలను సేకరించి సాయి భక్తులకు వివరించేవారు. వాటన్నిటిని ఈ గ్రంథంలో ప్రచురించడం సాధ్యంకాక అతి ముఖ్యమైనవి, ఇంతవరకూ ప్రచురితం కాని సాయి లీలలను స్వామీజీ బోధించిన సాయి తత్త్వాన్ని సాయి, మరియు స్వామీజీ ఆశీస్సులతో మీ కందిస్తున్నాను.

స్వామీజీ ఎల్లప్పుడూ బాబా అయోని సంభవుడు ఆయన సాక్షాత్తు దత్తాత్రేయుడే అని చెప్పేవారు. సాయి ఏనాడూ తమ తల్లిదండ్రుల పేర్లు ప్రస్తావించలేదు. బాబా సశరీరులుగా ఉన్నప్పుడు గానీ, మహాసమాధి తదనంతరం గానీ ఎవ్వరూ కూడ బాబా వారసుల మని చెప్పలేదు. బాబా బాల్యం ఎక్కడ, ఎట్లా గడిచిందీ కూడ ఎవరూ చూసినట్లు చెప్పలేదు. బాబా మహాసమాధి చెందిన తరువాత బాబా వారసు లెవరైనా ఉంటే వారికి బాబా వస్తువులను అంద జేస్తామని చెప్పినప్పుడు కూడా ఎవ్వరూ బాబా వారసుల మని ముందుకు రాలేదు. బాబా ఈ అవతారంతో 16 సం॥ల యువకుని గానే ప్రకటిత మయ్యారు. బాబా స్వయంగా "**బ్రహ్మము నాతండ్రి, మాయ నా తల్లి, వారి కలయిక వల్లనే ఈ శరీరం ఉద్భవించింది**" అని చెప్పారు. బాబా ఏనాడూ అసత్యమాడేవారు గాదు. ఈ అవతారంలో బాబాకు బాల్యంగానీ తల్లిదండ్రులుగానీ లేరని వారు సాక్షాత్తు పరబ్రహ్మమే నని వక్కాణించేవారు. నది మూలం, యోగి పుట్టుకను గురించి తెలుసుకునే ప్రయత్నాలు కూడ చెయ్యకూడదని మన పురాణాలు ఘోషిస్తున్నా బాబా జననాన్ని గురించిన తర్క, వితర్కాలు స్వామిజీని కలవరపరచేవి.

బాబా గురువును గురించి ప్రస్తావించి నప్పుడు కూడ స్వామీజీ బాబా సద్గురువులకే సద్గురువు, ఆయన ఆది గురువైన దత్తాత్రేయుని అవతారమేనని తెలిపే వారు. వెంకూసా విషయం ప్రస్తావించగా బాబా జననాని కంటే షుమారు నాలుగు దశాబ్దాల ముందుగానే వెంకూసా సమాధి చెందారని, ఈ విషయాన్ని వెంకూసా వారసులే

ధృవీకరించారని తెలిపారు. షిరిడీలోని గురుస్థానం విషయంలో బాబా స్వయంగా తానక్కడ 12సం॥లు తపస్సు చేసినట్లు చెప్పారుకదా! అనగా బాబా 16సం॥ల యువకునిగా ఉన్నప్పుడు ఈ విషయాన్ని చెప్పారు. అప్పటికి 12సం॥ల తపస్సు పూర్తి చేశారంటే 4సం॥ల బాలుడుగా ఉన్నప్పుడే బాబా తపస్సు ప్రారంభించి ఉండాలి గదా! అంత బాల్యంలోనే ఎవరికైనా తపస్సు చేయుటము సాధ్యమా? ఒక వేళ అది సాధ్యమైతే ఆయన మానవ మాత్రుడు కాదు, సాక్షాత్తు ఆ పరబ్రహ్మమే అయి ఉండాలి. అటువంటి పరబ్రహ్మకు గురువుయొక్క ఆవశ్యకత ఏముందని ఎదురు ప్రశ్నించేవారు. మరి ఈ విషయంలో బాబా అసత్యమాడారా అంటే ఎప్పుడూ సత్యాన్నే పలికేవారు. గురుస్థానం గురించి ఆయన చెప్పింది ఏ అవతారందో మనకు తెలియదు అని చెప్పేవారు. గురువు యొక్క ప్రాముఖ్యతను ప్రజలు విస్మరించ కుండా ఉండటానికే బాబా గురువును పదే పదే ప్రస్తావించే వారు. ఆయన దగ్గరగల ఇటుకను తమ గురుప్రసాదమని దానిని తమ ప్రాణ సమానంగా చూసుకుంటూ గురువును ఎలా గౌరవించాలో ఆచరించి చూపించారు బాబా అనేవారు స్వామీజీ. సద్గురువులకే సద్గురువైన సాయిబాబా తానెప్పుడూ గురువునని చెప్పుకోలేదు. తాను సామాన్య మానవుడిననియు, ఇతరుల నుంచి ఎంతో నేర్చుకోవాలని సెలవిచ్చేవారు. కాని ఈ తరం వారి ప్రవర్తన ఇందుకు పూర్తిగా విరుద్ధంగా ఉందని, కాషాయ వస్త్రాలు లేక శ్వేత వస్త్రాలు, రుద్రాక్ష మాలలు ధరించి బాబాను గురించి తమకు గల పరిమితమైన జ్ఞానంతో పది మందినీ ఆకట్టుకుని సాయిసన్నిధిలోనే గురువులమని చెప్పుకుని కీర్తిప్రతిష్ఠల కోసమో, భుక్తి కోసమో ప్రాకులాడే వారిని చూచిన స్వామీజీ వికలిత

మనస్కులయ్యేవారు. సాయి తత్త్వాన్ని ఆసాంతం ఆస్వాదించిన స్వామీజీ ''నేను ఓ,న,మః మాత్రమే నేర్చుకున్నాను, అవే మీకు బోధిస్తున్నాను, ఆపైన మనందరినీ నడిపించే వాడు సాయినాథుడే'' అని అతి వినయంగా సెలవిచ్చేవారు. నిరంతరం సాయి తత్త్వాన్ని షిరిడీలో గురుస్థానంలోని మెట్లక్రింద గల అతి చిన్న గది నుంచి దేశ, విదేశాలలో సహితం వినిపించిన ఘనత పూజ్య స్వామీజీదే.

బాబా అవతార ప్రత్యేకతను స్వామీజీ ఎంతో విపులంగా వివరించేవారు. ఒక్కొక్క అవతారం ఒక్కొక్క ప్రత్యేకతను కలిగి యుండగా కలియుగంలో అవతరించిన షిరిడీ సాయినాథుని అవతారం అనేక ప్రత్యేకతలను సంతరించుకుందని చెప్పేవారు. సాయినాథుడు సామాన్య మానవులకు అతి సామాన్యుడిగానూ, తన నిజమైన భక్తులకు మాత్రము అసామాన్యులు గానూ, రామ భక్తులకు రామునిగానూ, శివ భక్తులకు ఈశుని గానూ, దత్త భక్తులకు దత్తాత్రేయునిగానూ, ఉత్తమ శిష్యులకు వారి గురువు గాను దర్శన మిచ్చి సర్వదేవతల సమగ్ర స్వరూపమే శ్రీ సాయినాథుని అవతారమని చెప్పేవారు. కుల మతాల కతీతులై సర్వ మానవాళి సమానమని బోధించిన వారు అనేక మంది కాగా సర్వ ప్రాణికోటి సమానమని చాటిచెప్పటమేగాక సర్వ ప్రాణికోటి యందు తానే ఉన్నానని ఏ ప్రాణికి ఏది సమర్పించినా అది తనకే చెందుతుందని బోధించుటయే సాయినాథుని అవతారము యొక్క విశిష్టత.

భక్తులు తమ బాధలు నివారించుమని తమ ఇష్ట దైవాన్ని ప్రార్థిస్తే ఆ దైవం తన భక్తులను బాధా విముక్తులను చేయటం సర్వ సామాన్యమైన విషయం కాగా తన భక్తుల బాధలను తానే భరియించి, తన భక్తుల కర్మఫలాన్ని సమూలంగా నివారించుట సాయినాథుని యొక్క మరొక విలక్షణ విశిష్టత. ''**నా శరణు జొచ్చి నిష్ఫలంగా మరలి పోయిన వారి నొక్కరిని చూపించండి**'' అన్న సాయి అభయ హస్తం వారికి తమ భక్తులయందు గల ప్రేమానురాగాలను స్పష్టం చేస్తుంది. ఇన్ని విలక్షణమైన విశిష్టతలు గల సాయి బాబాను ఏ విధంగా పూజించాలో శేజ హారతి లోని ''వైరాగ్యాచా కుంచా ఘేవుని చౌకు ఝాడిలా, బాబా చౌక ఝాడిలా'' అన్న వాక్యంలో పదిలపరచ బడిందని స్వామీజీ చెప్పేవారు. దానిని వివరిస్తూ స్వామీజీ వైరాగ్య మనేది సర్వసంగ పరిత్యాగం చేసిన పుణ్య పురుషులకు లభిస్తుందనీ, ఆ వైరాగ్యాన్ని సహితం బాబా శయ్యా స్థలాన్ని శుభ్రపరచుటకు చీపురుగా ఉపయోగించితే బాబా యొక్క సంపూర్ణ అనుగ్రహం పొందడానికి అర్హులౌతారని తెలిపేవారు.

హారతి సమయాలను గురించి ఆయా సమయాల్లో బాబాకు నాలుగు హారతులు ఎందుకు ఇస్తున్నారో, ఎంతమంది భక్తులకు తెలుసు న్నదీ అనుమానాస్పదమే. మన పూజ్య స్వామీజీ హారతి సమయాలకు గల ప్రాధాన్యతను వివరించిన వైనం మీకందిస్తున్నాను.

ప్రతినిత్యం అరుణోదయ సమయాని కంటే ముందుగానే మేల్కొంచి కాలకృత్యాలు ముగించుకుని ''బాబా నీవే మాకు తల్లి,

తండ్రి, గురువు మరియు దైవం, మీ బిడ్డలమైన మమ్ము నీవే కాపాడాలి.'' అని బాబా పాదోదకాన్ని స్వీకరించి దినచర్యను ప్రారంభించటానికి నిర్దేశించ బడినదే 'కాకడ' హారతి.

మధ్యాహ్న సమయానికి మనం వండుకున్న వంటకాలన్నీ బాబాకు నివేదించి ఆ ఉచ్ఛిష్టాన్ని మనం భుజించాలని తెలుపటానికే 'మధ్యాహ్న హారతి'.

సంధ్యాకాంతుల వేళ రవి అస్తమించే సమయంలో, పగలంతా కష్టించి పనిచేసి అలసి సొలసిన శరీరాలకు ఆ ప్రశాంత సమయంలో బాబా సన్నిధానంలో మరింత ప్రశాంతత లభిస్తుందన్న విశ్వాసమే 'సాయం హారతి'.

దినచర్యను ముగించుకుని నిద్ర కుపక్రమించే ముందు సాయినాథునికి మరొక్కసారి ప్రణమిల్లి నిదురలో చెడు స్వప్నాలు సహితం రాకుండా కాపాడి తెల్లవారగానే సుఖంగా నిద్ర మేల్కొంచి కాకడ హారతికి హాజరయ్యేలాగా చూడమని ప్రార్థించి బాబా ప్రసాదం స్వీకరించాలని తెలుపుటయే 'శేజ హారతి' విశిష్టత.

బాబా హారతులను శ్రీయుతులు 1) శ్రీసంత్ తుకారాం మహరాజ్, 2) శ్రీ సంత్ జానాభాయి, 3) శ్రీకృష్ణ జగదీశ్వర్ భీష్మ, 4) శ్రీసంత్ నామ్‌దేవ్, 5) శ్రీదాసుగణు మహారాజ్, 6) శ్రీమాధవరావు వామన రావుఅడ్కర్, 7) శ్రీమోహన్ రాజు, 8) శ్రీఉపాసనీ బాబా, 9) శ్రీరామేశ్వర్ భట్ మరియు 10) శ్రీబి.వి.

దేవ్ రచించారని స్వామీజీ తెలియ జేశారు.

మన పూజ్య స్వామీజీ పాత మరాఠీ సాయిలీల మాస పత్రికల నుంచి అనేక మంది సాయి భక్తుల నుంచి అనేక సాయి లీలలను సేకరించి భక్తులకు వివరించే వారు. వాటిలో అతి ముఖ్యమైన వాటిని మీ ముందుంచుతున్నాను.

బాబా రెండవ పర్యాయం షిరిడీ వచ్చినపుడు ఖండోబా మందిర పూజారి బాబాను ''ఆవో సాయి'' అని ఆహ్వానించటం మనందరికి విదితమే. కాని బాబా 1853 లేక 1854లో ప్రథమంగా షిరిడీ వచ్చినపుడు, షిరిడీ గ్రామస్థులు ఆయన పేరు, ఊరు అడుగగా బాబా ''హమ్‌తో సాయిహై, గోసాయి హై లంబే లంబే సే ఆయే హై'' అని చెప్పినట్లు శ్రీ పాండురంగ కావడే అనే భక్తునిచే రచింపబడిన ఒక గ్రంథంలో ప్రస్తావించి నట్లు స్వామీజీ చెప్పి బాబాకు ఎవరు పేరిడినా ఆ నామ మహాత్మ్యాన్ని మనం గుర్తించాలి, ఈ కలియుగంలో ''**సాయి**'' అన్న రెండక్షరాలు భక్తుల పాలిటి కల్పతరువు, కామధేనువు కన్న మిన్న, ''**సాయి**'' అన్న పదం ఉచ్చరించిన మాత్రాన్నే సర్వనదులలో స్నాన మాచరించిన ఫలితం, సర్వకోటి పుణ్య క్షేత్రాలు దర్శించిన ఫలితం కలిగి ఆ '**సాయి**' నామమే మనని భవసాగరాన్ని దాటిస్తుంది కాబట్టి సాయి భక్తులు ఎల్లవేళలా సాయి నామ స్మరణ చేస్తే అదే వారికి శ్రీరామ రక్ష అని పేర్కొనే వారు.

ఒక పర్యాయం రాధాకృష్ణ ఆంయీ జ్వరంతో బాధ పడుతుండగా బాబా ఆమె ఇంటి దగ్గరకు వచ్చి ఒక నిచ్చెన తెప్పించి ఆ నిచ్చెన మీదుగా ఇంటి మీదకెక్కి మరొకవైపునుంచి దిగి రాధాకృష్ణ ఆయీకి స్వస్థత చేకూర్చిన వైనం సాయి భక్తులైన మనకందరికి విదితమే. ఆ నిచ్చెన తెచ్చిన వ్యక్తికి రెండురూపాయల నిచ్చి కష్టానికి మించిన కూలి నివ్వాలని తెలియ జేసిన సంగతి కూడ మనకందరికి తెలుసు. ఆ నిచ్చెన తెచ్చిన వ్యక్తిపేరు వెంకూ షింపే కాంబ్లేకర్ అనియు అతనికి సంతానం లేకపోవటంతో బాబా ప్రసాదించిన రెండు రూపాయలను తన పూజా మందిరంలో ఉంచి పూజించగా అనతి కాలంలోనే అతనికి ఇరువురు మగ సంతానం కలిగినట్లు స్వామీజీ కాంబ్లేకర్ పెద్దకుమారుడైన అనంతరావుకాంబ్లేకర్ ద్వార తెలుసుకొన్నట్లు వివరించారు. నిచ్చెన తెచ్చినందుకే బాబా రెండు రూపాయల నివ్వటం అందరిని ఆశ్చర్య పరచగా అతని చిరకాల మనోవాంఛ నీడేర్చి సంతానాన్ని ప్రసాదించిన వైనం ఎంత మంది సాయి భక్తులకు తెలుసునన్నది అనుమానాస్పదమే.

బాబా షిరిడీలో నివసించే రోజుల్లో అరుదుగా నీంగామ్‌కు, రహతా నివాసియగు డేంగలే గృహానికి మాత్రం వెళ్ళేవారు. బాబా షిరిడీ పొలిమేరలు దాటుతున్నారన్న విషయాన్ని తెలుసుకుని వారి భక్తులు బాబాను షిరిడీ వదలి వెళ్ళవద్దని ప్రాధేయ పడితే తిరిగి సాయంకాలానికి షిరిడీకి వస్తానని వారికి అభయ మిచ్చి వారి కోర్కెను మన్నించే వారు. ఒక పర్యాయం బాబా డేంగలే గృహానికేగి అతనితో సంభాషిస్తుండగా పెరటిలోని చెట్టు మీద రెండు పక్షులు మాట్లాడు

కోవడం గమనించిన సాయి అవి ఏమి మాట్లాడుకుంటున్నాయని పక్షిభాష తెలిసిన డేంగలేను అడగగా ఆ రోజు షిరిడీలో శని దేవాలయంలో శని దేవునికి సమర్పిస్తున్న ప్రసాదంలో ఒక విషసర్పము చచ్చినదని అది తిన్న తొమ్మిది మంది భక్తులు మరణిస్తారని ఆ పక్షులు మాట్లాడు కుంటున్నట్లు చెప్పగా అది విన్న సాయి వెంటనే టాంగా కట్టించుకుని ద్వారకామాయికి వచ్చి భాగోజీతో ఆ విషపూరితమైన ప్రసాదాన్ని నేలపాలు చేయించగా అచటి భక్తులందరు భాగోజీని కొట్టటానికి రాగ అతను బాబాను శరణు వేడాడు. బాబా వారందరిని వారించి ఆ ప్రసాదాన్ని నేలపై గుమ్మరించగా అందులో చచ్చి పడిన విషసర్పాన్ని చూచి తమ ప్రాణాలను కాపాడినందులకు సాయి నాథుని కీర్తించారు. అప్పుడు సాయి వారి ప్రాణదాత తాను కాదనియు ఆ ఘనత డేంగలేకు చెందాలనియు జరిగినదంతా వారికి వివరించారు. సర్వ ప్రాణికోటిలోను తానై ఉన్న సాయినాథునికి పక్షిభాష తెలియదా? అన్న సందేహం మానవ మాత్రులమైన మనకు కలగటం అతి సహజం. ఈ లీలను వర్ణించిన మనస్వామిజీ వద్ద ఈ సందేహాన్నే వెలిబుచ్చగా సాయినాథుని ఆజ్ఞలేక ఆకైనా కదలదనియు, ఆయనెప్పుడు కీర్తికాంక్షలకు ప్రాకులాడే వారు కాదనియు, ప్రతి మంచి కార్యానికి ఒకరిని కారణ మాత్రునిగా చేసి ఆ కీర్తి, ప్రతిష్ఠలకు తాము దూరంగా ఉండేవారని స్వామీజీ శలవిచ్చారు. జ్ఞాన రాశియై యుండియు సామాన్యుని వలె, చక్రవర్తి అయ్యుండియు- ఫకీరువలె, పంచభక్ష్య పరమాన్నములు రజత పాత్రలలో ఆయనకు సమర్పించినను భిక్షాటనముతో తన జీవనాన్ని సాగించిన పరమ పూజనీయుని పాదారవిందములను మన మాశ్రయించుట మన పూర్వజన్మ సుకృతమే

నని వచించారు మన పూజ్య స్వామీజీ. తన భక్తుల రక్షణమే తన ప్రథమ కర్తవ్యంగా నెంచుకున్న సాయినాథునికి మన మనస్సు నర్పించుటయే మన కర్తవ్యమని బోధించారు మన స్వామీజీ.

సాయి సశరీరులుగా ఉన్న సమయంలో ఒక వనితకు వయస్సు మీరుతున్నా గాని వివాహం కాక పోతే ఆమె బాబాకు తన వివాహం త్వరగా జరిగేటట్లు అనుగ్రహిస్తే వివాహం తరువాత బాబాను దర్శించి ఒక టెంకాయను బాబాకు సమర్పిస్తానని మ్రొక్కుకున్నది. భక్తవత్సలుడైన సాయి ఆమె మొరనాలకించి వివాహం జరిపించారు. ఆమె తల్లిదండ్రులు చీర, సారెతో ఆమెను అత్తవారింటికి పంపి తమ బాధ్యతను నెరవేర్చుకున్నారు. ఆమె అత్తవారింటిలోని వారందరికీ బాబాపై నమ్మకం లేకపోగా బాబాను దూషించేవారు. అట్టివారు తనను బాబా దర్శనానికి పంపరని నిశ్చయించుకుని బాబాయే వారి మనస్సులను మార్చి తనను షిరిడీకి రప్పించుకోమని బాబాను వేడుకుంది. **''నా భక్తులు ఎంత దూరంలో ఉన్నను, సప్తసముద్రముల ఆవల నున్నను పిచ్చుక కాళ్ళకు దారము కట్టిలాగు చందమున వారిని నావద్దకు రప్పించుకుందును''** అన్న సాయినాథుడు తన భక్తురాలు తన దర్శనార్థమై తహతహ లాడుతుంటే మిన్నకుండునా! ఆమె భర్త మనస్సును మార్చి ఆమె షిరిడీ ప్రయాణమునకు కావలసిన ఏర్పాట్లన్నియు అతని చేతనే చేయించి ఆమెను షిరిడీకి రప్పించుకొనెను. ఆమె బాబాను దర్శించి తన మనోవాంఛ నీడేర్చిన భగవంతుని పాదార విందములకు ప్రణమిల్లి తన భక్తి, శ్రద్ధలను చాటుకొనెను. ఆ రాత్రి షిరిడీలోనే గడిపి తెల్లవారి

ఉదయాన్నే ఒక టెంకాయను చేతబుచ్చుకొని ద్వారకామాయి చేరుకున్నామె తన నాసికా భరణం ఎవ్వరో దొంగిలించటం గమనించి దుఃఖపూరితురాలై నాసికాభరణం లేకుండా తన అత్తవారింట్లో అడుగు పెడితే తనను కాపురం కూడ చెయ్యనివ్వరని తలంచి తనకు మేలు చేసిన బాబానే దుర్భాష లాడసాగింది. బాబా ''అమ్మా, నీ నాసికా భరణాన్ని ఎవ్వరూ దొంగిలించలేదు అది నీ దగ్గరనే ఉంది'' అనగా ఆమె బాబా అసత్యాలు పలుకుతున్నారని ద్వారకామాయి నుంచి బయటకు వెళుతూంటే ఆమెతో బాబా ''అమ్మా, నాకోసం తెచ్చిన టెంకాయను నా కివ్వవా?'' అని అడుగగా ఆమె మరింత కోపంతో బాబా చెంతకు వచ్చి ''నీ కొబ్బరికాయను నీవే తీసుకో'' అని దానిని నేలమీద పగల కొట్టగానే ఆమె నాసికాభరణం అందులోంచి బయటకు వచ్చింది. రవి సహితం కాంచలేని నారికేళం నుంచి నాసికాభరణాన్ని రప్పించుట పరబ్రహ్మ స్వరూపమైన బాబాకే సాధ్యమని మన పూజ్య స్వామీజీ వివరించారు.

బాబాయొక్క ఈ లీలకు ఆమె అచ్చెరువొంది బాబా దయార్ద్రతకు ఆనందబాష్పాలు రాలగా, మహనీయుడైన సాయి పవిత్ర చరణాలకు ప్రణమిల్లి బాబా ప్రసాదించిన ఊది ప్రసాదాన్ని గైకొని బాబా అజ్ఞతో తన గృహాని కేగింది.

శ్రీ దాసుగణు మహారాజా బాబాను దర్శించి తనకు గంగా యమునల సంగమంలో స్నాన మాచరించ వలెనన్న కోరికను వెలిబుచ్చి తన కాజ్ఞనిమ్మని బాబాను వేడగా గంగా యమునలను తన చరణాల

చెంతనే పారించారు బాబా. ఇందులోని పరమార్థాన్ని వివరించిన మన స్వామీజీ సాయి తత్త్వాన్ని ఎంత నిశితంగా పరిశీలించి అవగాహన చేసుకున్నదీ పాఠకులు గ్రహింతురుగాక. పవిత్ర నదులలో స్నాన మాచరిస్తే పాప ప్రక్షాళణ మవుతుందన్న విశ్వాసంతో నదులలో స్నాన మాచరించి పునీతులవుతారు మానవులు. యోగుల, పుణ్యచరితుల చరణ ధూళితో తమ పాపభారాన్ని తొలగించుకుంటాయి నదీమ తల్లులు. యోగులకే యోగిరాజు, పుణ్యమూర్తులకే పరమ పునీతుడైన సాయి చరణధూళి కొరకు నదీమ తల్లులు తహతహ లాడుతుండగా మన బాబా షిరిడీ సరిహద్దులు దాటకుండగనే వాటి కోర్కెను నెరవేర్చారు మన సాయి. బాబా ''దాసూ గంగా యమునల కొరకు అంత దూరం వెళ్ళాలా? అవి ఇక్కడ లేవా?'' అనగానే గంగా యమునలు బాబా తమకు షిరిడీ ప్రవేశానికి అనుమతి నిచ్చారని గ్రహించి బాబా పవిత్ర చరణాలను ముద్దిడి తమ పాప భారాన్ని ప్రక్షాళణం గావించుకున్నాయి.

## వ్యాధులు బాపే ఊది :

బాబా తనను దర్శించ వచ్చిన భక్తులకు ఊది ప్రసాదాన్నిచ్చి, ఆశీర్వదించే వారు. బాబా ద్వారకామాయిలో ప్రజ్వలంప జేసిన నిత్య అగ్నిహోత్రంలోని విబూది పేరే ''**ఊది**''. వ్యాధి గ్రస్తుల పాలిట దివ్య ఔషధం ఈ ఊది. ఊదిని సేవించే వారికి బాబాయందు విశ్వాసముంటే చాలు అది సంజీవని కన్నా మిన్నగా పని చేస్తుంది. ఊది మాహాత్మ్యం ఇప్పటికే చాల గ్రంథాలలో వివరించ బడినది.

ఒక పర్యాయం ఒక వ్యక్తి అరటి పండులో విషం కలిపి బాబా ప్రసాదంగా తన స్నేహితుని కివ్వగా దానిని నోట్లో పెట్టుకోగానే అతని నాలుక కొస రెండుగా చీలి రక్తం స్రవిస్తూ మాట్లాడలేని స్థితిలో స్వామీజీ దగ్గరకు వచ్చి సైగల ద్వారా జరిగిన విషయాన్ని తెలియజేయగా స్వామీజీ వెంటనే అతనిని ద్వారకామాయికి తీసుకు వెళ్ళి ధునిలోని ఊదిని అతని నాలుకపై పూయగా కొద్ది క్షణాలలోనే అతని గాయం మాయమై మాట్లాడ సాగాడు. స్వామీజీ అతని దగ్గర మిగిలిన అరటి పండును తీసుకొని ధునిలో వేసి అతని ప్రాణాలు కాపాడిన బాబాకు నమస్కరించి ధునికి కొబ్బరికాయ, ఆవునెయ్యి, అగరు బత్తులు, అవని సామగ్రి సమర్పించి కృతజ్ఞతలు తెలియ చేసుకున్నారు.

బాబా భక్తుడైన నానా చందోర్కర్ కుమార్తె మైన తాయికి ఊదిని సేవింప చేసిన వెంటనే సుఖప్రసవమైన సంగతి మనందరికీ తెలుసు. గర్భిణీ స్త్రీలు ఊది, తేనె 1:3 నిష్పత్తిలో సేవిస్తేసుఖప్రసవ మవుతుందని మన పూజ్య స్వామీజీ తెలియ జేసారు.

శ్రీ టి.యస్. యస్. ప్రసాద రావు గారి (ఇంటి నెం. 111, సెక్టారు-2, సచివాలయనగర్, వనస్థలిపురం, హైదరాబాదు-500 070) భార్య మధుమేహ వ్యాధితో బాధపడుతూండేవారు. ఒకసారి ఈమెకు కాలిలో మేకు గుచ్చుకొని గాయమై నడవలేని పరిస్థితిలో వైద్యులను సంప్రదించగా ఆపరేషన్ చేయాలని చెప్పారు. శ్రీ ప్రసాద రావు సాయి అంకిత భక్తులు, సాయి సచ్చరితను రెండువందల

పర్యాయాలు పైగా పారాయణము చేసిన భక్తులు. బాబా యందు అత్యంత విశ్వాసము గలవారు. ఆయన భార్యకు వైద్యులు ఆపరేషన్ చేయాలని వేరే మార్గం లేదని చెప్పగా బాబా పైనే భారం వేసి ఆమె గాయానికి ఊది రాసి, ప్రతినిత్యం బాబా తీర్థం ఇవ్వగా మూడవ రోజునుంచే ఆమె నడవగలిగింది. వారం రోజుల్లోనే గాయం పూర్తిగా మాని ఆరోగ్యవంతు లయ్యారు. ఈ వింతను చూచిన వైద్యులు సహితం ఆశ్చర్య పోయారు.

ఇంతటి మహిమాన్వితమైన ధునికి మన పూజ్య స్వామీజీ ప్రతినిత్యం మధ్యాహ్న హారతి తరువాత ఒక కొబ్బరికాయను సాయంకాలపు హారతి అయిన తరువాత తొమ్మిది కొబ్బరి కాయలను సమర్పించేవారు.

## సమస్యలకు సమాధాన మిచ్చే సమాధి :

**''నా సమాధి పలుకుతుంది, అది మీ కోర్కెలను తీరుస్తుంది''** అని బాబా తన భక్తుల కిచ్చిన అభయ హస్తం నూటికి నూరుపాళ్ళు సత్యం. ఈ నాటికీ బాబా మహా సమాధి వద్ద అనేక మంది భక్తులు వివిధ రకాలైన అనుభూతులు పొందుతున్నారు. వాటిలో కొన్నిటిని మన పూజ్య స్వామీజీ తెలియ జేయగా వాటిని మీ కందిస్తున్నాను.

బాబా మహాసమాధి చెందిన తరువాత బొంబాయి నివాసి యగు శ్రీమతి రుస్తుంజీ షిరిడీ వచ్చి బాబా మహాసమాధికి తల

అన్ని ''బాబా నీవు జీవించి ఉన్న రోజుల్లో నా కష్టాలు కడతీర్చి నన్ను రక్షించావు. ఇప్పుడు నాకు దిక్కెవరు?'' అని రోదిస్తుండగా ఆమెకు సమాధి నుంచి ''రుస్తుం బేటా కబ్ ఆయా'' అన్న మాటలు మూడు పర్యాయాలు వినిపించగా ఆ మాటలు విన్న ఆమె బాబా సమాధి నుంచియే సర్వకార్యములు నిర్వహించగల సమర్థులని గ్రహించి అత్యంత ఆనందంతో బొంబాయి చేరుకుంది.

ఆంధ్రప్రదేశ్ లోని కాకినాడకు చెందిన మరొక భక్తుడు షిరిడీ వెళ్ళి బాబా సమాధి దగ్గర ''బాబా, నీ సమాధి పలుకుతుందన్న నీ అభయం నిజమైతే ఈ క్షణాన్నే నాకేదైనా నిదర్శనం చూపించు'' అనగా పై నుంచి ఒక చిన్న రాయి అతని ముందు పడింది. దానిని తీసి చూచి విస్మయుడయ్యాడు. దానికి కారణం ఆ రాయి మీద బాబా బండ మీద సుఖాసీనులై ఆశీర్వదిస్తున్న చిత్రం అతి సుందరంగా చిత్రించబడి ఉన్నది. ఈ వింతను చూచిన ఆ భక్తుని ఆనందాన్ని ఎవ్వరికేని వర్ణించ శక్యమా!

బాబా సమాధిని శుభ్రం చేసిన బట్టను కాల్చి మసి చేసి ఆ మసిని గాయాలకు పూస్తే ఎటువంటి గాయమైనా మటుమాయ మవుతందని మన స్వామీజీ అనుభవ పూర్వకంగా తెలిపారు.

ఇటువంటి లీలలు అనేకం జరిగాయి, జరుగుతున్నాయి. ఇకముందు కూడ జరుగుతాయని వీటిని అనుభవించటానికి మనకుండ వలసిన అర్హతల్లా బాబా యందు అచంచల భక్తి, విశ్వాసాలు మాత్రమే నని శలవిచ్చేవారు మన స్వామీజీ.

బాబా జీవితంలో జరిగిన ప్రతి చిన్న విషయాన్ని సహితం బాబాను సేవించిన భక్తులనుంచి సేకరించి సాయి భక్తుల కందించే వారు మన స్వామీజీ. వాటిలో కొన్నిటిని ఇంతకు ముందే మీకందించగా మరి కొన్నిటిని ఇప్పుడు మీ ముందుంచుతున్నాను.

ప్రస్తుతం చావడిలోగల చక్రాల కుర్చీని 1917వ సంవత్సరములో శ్రీ కాకా సాహెబ్ దీక్షిత్తు బాబాకు సమర్పించి, బాబాను బలవంతంగా అందులో కూర్చుండ బెట్టి లెండీబాగ్ వరకు తీసుకు వెళ్ళాడు. అటు పిమ్మట బాబా ఆ కుర్చీని ఎప్పుడు వాడలేదు.

దార్వకామాయిలో గల బాబా వాడిన తిరగలిని శ్రీమతి లక్ష్మీబాయి షిండే బాబాకు సమర్పించినది.

ప్రస్తుతం బాబా అభిషేకానికై భక్తులు వేచి యుండే పెడ్డే అలనాటి తకియా.

నేటి పారాయణ హాలే నాటి శ్యామా పాఠశాల. అబ్దుల్ బాబా కాటేజీ వెనుక రాధాకృష్ణమాయి గృహముండేది.

ద్వారకామాయిలో ధునికి ఎదురుగా సుందరమైన మందిరంలో గల బాబా చిత్రపటాన్ని దర్శించి బాబాను సజీవంగా చూచినంత ఆనందాన్ని కలుగ జేస్తున్న ఆ చిత్రాన్ని జయకర్ అనే చిత్రకారుడు చిత్రీకరించాడు. బాబా చిత్రాన్ని చూసి ''**మై గల్లీ గల్లీ మే రహానే వాలా హై, ఔర్ బనావో జ్యాదా బనావో**'' అని తమ భవిష్యత్

కార్యక్రమానికి ఆనాడే పునాదులు వేసుకున్నారు. దాని ప్రభావమే ఈనాడు ప్రతి పల్లెలో సహితం బాబా మందిరాలు వెలుస్తున్నాయి.

షిరిడీలో గురుస్థాన్‌లో గల వేప వృక్షానికి గల తొమ్మిది కొమ్మలు నవ విధ భక్తులకు సంకేతమని ఈనాటి భక్తుల నమ్మిక కాగా అవి నవగ్రహాలకు ప్రతీక యని అలనాటి భక్తులు విశ్వసించి అక్కడ కొట్టిన కొబ్బరి కాయను అక్కడే వదిలి వేసేవారు.

## స్వామీజీ ఛలోక్తులు :

బాబా అప్పుడప్పుడు సున్నితమైన హాస్యాన్ని ప్రదర్శించి తమ భక్తులను నవ్వించేవారు. అదే రీతిన మన పూజ్య స్వామీజీ కూడ ఛలోక్తులు విసిరి తమ భక్తులను ఆనంద పరిచే వారు. వాటిలో కొన్ని మచ్చుతునకలు.

స్వామీజీకి గురుస్థానంలో గల మెట్ల క్రింద వసతి ఏర్పాటు చేయగా అది అసౌకర్యంగా ఉందని స్వామి భక్తులు బాధపడి వేరే నుంచి వసతి ఏర్పాటు చేస్తామనగా ''నాకు గురుస్థానానికి పదోన్నతి కల్పించాడు బాబా'' అని ఛలోక్తి విసిరారు.

అనేక మంది సద్గురువుల మని చెప్పుకుంటూ బాబా సన్నిధిలో సహితం గురువుల మని చెప్పుకునే వారిని చూసిన స్వామీజీ ''ఈనాడు బాబా తప్ప మిగిలిన వారంతా గురువులే'' అని చమత్కరించేవారు. కొంత కాలం పోతే ఈ లోకంలో అంతా గురువులే ఉంటారు, శిష్యులు మాత్రం కానరారు అని కూడ హాస్యంగా

మాట్లాడేవారు.

కొంతమంది బాబాకు కుల మతాలను ఆపాదిస్తే, మరి కొంతమంది బాబాకు ప్రాంతీయ తత్వాన్ని కూడ అంటగడుతున్నారనియు దీనికి ఉదాహరణగా బాబా అన్నం వండి అన్నదానం చేసారు కాని రొట్టెలు చేసేవారు కాదు కాబట్టి ఆయన దక్షిణ భారత ప్రాంతానికి చెందిన వారని వాదించే వారిని చూసిన స్వామీజీ సాక్షాత్తూ పరబ్రహ్మ మైన సాయికి కూడ ఈ బాధ తప్పలేదని వాపోయేవారు.

## స్వామీజీ ఆశీస్సుల బలం :

మన పూజ్య స్వామీజీ ఆశీస్సులతో దేశం లోని వివిధ ప్రాంతాలలోనే గాక విదేశాలలో సహితం అనేక సాయి మందిరాలను నిర్మించారు స్వామీజీ భక్తులు. మందిర నిర్మాణ సమయంలోను ఆ తరువాత మందిరంలో జరప వలసిన నిత్య కార్యక్రమాలను స్వామీజీ వారికి వివరించే వారు. మన దేశంలో ప్రతి నగరంలోను స్వామీజీ ఆశీస్సులతో సాయి మందిరాలు నిర్మితమైన వనుటలో కించిత్తు కూడ అతిశయోక్తి లేదు.

స్వామీజీ ఆశీస్సులతో రెండవ షిరిడీ నిర్మాణాన్ని హైదరాబాదు నగరములోని మల్లాపూర్ నందు చేపట్టి ఇప్పటి వరకు గురుస్థాన్, ద్వారకామాయి నిర్మాణాలను పూర్తి గావించారు అఖిల భారత సాయి నామ సప్తాహ కమిటీ వారు. వీరే దత్త క్షేత్రమైన గాణుగాపురంలో నిత్య అన్నదాన పథకాన్ని ప్రారంభించాలని తలచి

స్వామీజీ ఆశీస్సులు కోరగా స్వామీజీ ఆశీర్వదించటమే గాక వారి అమృత హస్తాలతో తొలి భిక్షనొసంగారు. వారి ఆశీర్వాద బలం వల్ల అది అతి త్వరలోనే అభివృద్ధి చెంది విరాజిల్లుతోంది. వీరు చేపట్టే ప్రతి కార్యక్రమాన్ని ఆశీర్వదించి ప్రోత్సహించిన స్వామీజీ జ్ఞాపకార్థం మల్లాపూరంలో ఒక చక్కని జ్ఞాన మందిరాన్ని, శ్రీక్షేత్రగాణుగాపురంలో 25.3.96న అన్నదాన ప్రాంగణ మందు అఖండ దీపారాధన, శివలింగ ప్రతిష్ఠను గావించారు.

ప్రతినెల స్వామీజీ జన్మ దినమైన 12వ తేదీన మల్లాపూర్‌లో అన్నదాన కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. స్వామీజీ ఆశీస్సులతో ఒక అనాథ బాలుర ఆశ్రమాన్ని కూడ నిర్వహిస్తున్నారు.

వీరు నిర్మించిన ద్వారకామాయి ధుని నుంచి పొగ ద్వారకామాయంతా వ్యాపించి భక్తులకు అసౌకర్యాన్ని కలగ జేయగా ఈ విషయాన్ని విన్నవించగా స్వామీజీ పొగగొట్టం ఎత్తు పెంచమని శలవివ్వగా పొగగొట్టం సరియైన స్థలంలోనే సరియైన కొలతలతోనే అమర్చామని చెప్పగా స్వామీజీ మీరు నిర్ణయించిన దానికంటే పొగగొట్టం ఎత్తు తక్కువైనదని చెప్పారు. వారు పరీక్షించి చూడగ పొగగొట్టం ఎత్తు అనుకున్న దానికంటే తక్కువ ఎత్తు ఉండుట గాంచి ఆశ్చర్యపోయి దానిని సరిచేశారు. ఎంతో దూరంలో గల షిరిడీలో ఉండి హైదరాబాదులో జరిగిన చిన్న పొరపాటు సహితం స్వామీజీ దృష్టిని తప్పించుకో లేక పోయిందంటే స్వామీజీ దివ్య దృష్టి ఎంత గొప్పదో పాఠకులే గ్రహింతురు గాక.

ఆదిలాబాదు జిల్లా కల్లూరులో స్వామీజీ ఆశీస్సులతో శ్రీ దత్త వెంకటసాయి సమాజంను స్థాపించి సుందరమైన దత్తాత్రేయ, వేంకటేశ్వర స్వామి, సాయినాథుని మందిరాలు నిర్మించి, ధునిని కూడ ఏర్పాటు చేశారు. స్వామీజీ ఆశీస్సులతో నిత్య అన్నదాన పథకాన్ని అక్కడకు వచ్చే యాత్రికులకు ఉచిత వసతి సౌకర్యాన్ని కూడ కల్పిస్తున్నారు.

స్వామీజీ మహాసమాధి చెందిన పిదప ఒక సుందరమైన ప్రార్థన, పారాయణ మందిరాన్ని నిర్మించి చంద్రునికో నూలు పోగు చందాన స్వామిజీకి అంకిత మిచ్చారు.

ఈ సమాజం వారే స్వామీజీ కి షిరిడీలో సరియైన వసతి కూడ లేక అవస్త పడుతూండటం చూచి స్వామీజీకి కల్లూరులో ఒక చక్కని ఆశ్రమాన్ని నిర్మించి స్వామీజీని కల్లూరు తీసుకు వెళదామని తలంచి తమ కోర్కెను స్వామీజీకి విన్నవించగా స్వామీజీ తనకు సాయి సన్నిధియే పరమావధి యని షిరిడీ వదిలి ఎక్కడకు వెళ్ళేది లేదని ఖచ్చితంగా చెప్పారు. స్వామిని ఏవిధంగా నైనా తీసుకు వెళ్ళి అన్ని వసతులు కల్పించాలని తలచిన భక్తులు స్వామీజీ రాత్రులందు (పగలు వీలుకానప్పుడు) లెండీబాగ్‌లో గల నంద దీపానికి, దత్తమందిరాలకు ప్రదక్షిణలు చేసే సమయంలో బలవంతంగా కారులో ఎక్కించుకొని కల్లూరు తీసుకు పోవాలని నిర్ణయించుకుని కారును లెండీబాగ్‌కు అతి సమీపాన పార్కు చేసి స్వామీజీ రాక కోసమై కాపలా కాయసాగారు. కాని ఆ రాత్రి స్వామీజీ ప్రదక్షిణాలకు వెళ్ళకపోగా పది గంటలకే తమ

గది తలుపులు వేసుకొని తెల్లవారు జాము వరకు బయటకు రాలేదు. తెల్లవార్లు స్వామి రాకకోసం నిరీక్షించిన భక్తులు తెల్లవారగానే స్వామీజీని కలువగా స్వామీజీ ''రాత్రల్లా నిద్రపోకుండా బాగానే కాపలా కాసారు, రూముకి వెళ్ళి నిద్రపోండి'' అన్నారు. స్వామీజీ సర్వజ్ఞతను కనులార గాంచిన ఆ భక్తులు ఆశ్చర్య చకితులయ్యారు.

ఒక పర్యాయం శ్రీ ప్రభాకర్, సెక్రటరీ, శ్రీ దత్త వెంకటసాయి సేవా సమాజం, కల్లూరు, వారి స్నేహితులైన శ్రీ తిరుపతయ్య గారితో కారులో షిరిడీకి వెళ్ళి స్వామిని దర్శించగా ప్రభాకర్‌తో స్వామీజీ నీ స్నేహితుని గ్రహబలం బాగోలేదు. అతని చేత షిరిడీలో గల శని, మారుతీ, ఖండోబా మందిరాలకు, లెండీబాగ్‌లో నంద దీపానికి ప్రదక్షిణలు చేయించి తిరుగు ప్రయాణంలోశని సింగణాపూర్ వెళ్ళి అక్కడకూడ అభిషేకాలు చేయించికొని కల్లూరు వెళ్లమని ఆజ్ఞాపించారు. స్వామీజీ చెప్పిన ప్రకారమే చేసి కల్లూరు పరిసర ప్రాంతాలు చేరగానే కారుకు ప్రమాదం సంభవించింది. కారులోంచి అందరూ దిగగానే కారు పెద్ద లోయలో పడిపోయి తునాతునకలైనది. జరగబోయే ప్రమాదాన్ని ముందుగానే పసిగట్టి వారిని రక్షించిన స్వామీజీకి జోహారు లర్పించారు.

శ్రీ పుంజాల శ్యామ మూర్తి గారు, కబూతర్ ఖానా, హైదరాబాదులో గల సాయి మందిర మందు సప్త సప్తాహము (నామ సంకీర్తన) చేయ తలపెట్టి స్వామీజీ ఆశీస్సులు కోరగా స్వామీజీ తొలి దక్షిణ నొసంగి '' ఈ డబ్బుతో బియ్యం, నూనె కొనండి, సప్త సప్తాహం

కంటే ఎక్కువ చేయించుకుంటాడు బాబా'' అని ఆశీర్వదించారు. స్వామీజీ ఆశీస్సులు లభించాయని సంతోషించి 3.6.1994న సప్త సప్తాహం ప్రారంభించి, వచ్చిన భక్తులందరికి ఉచిత భోజన సదుపాయం ఏర్పాటు కూడ భక్తులిచ్చిన విరాళాలతో ప్రారంభించారు. ఈ నామ సంకీర్తన 19.9.1994 వరకు అనగా 108 రోజులు నిరంతరంగా నిత్య అన్నదానంతో జరిగింది. అత్యంత భక్తి శ్రద్ధలతో భక్తులు ఈ కార్యక్రమంలో పాలు పంచుకొని ధన్యులయ్యారు. ఈ కబూతర్ ఖానా మందిరంలో బాబా ద్వారకామాయి భంగిమలో గల పాలరాతి విగ్రహాన్ని ప్రతిష్ఠించుట ఒక ప్రత్యేకత. మనం కోరుకున్న దానికంటే ఎక్కువే సాయి ఆశీస్సులతో స్వామి ప్రసాదించేవారు.

## స్వామిని కరుణించి దర్శన మిచ్చిన సాయి :

స్వామి నిస్వార్థ సేవకు ప్రసన్నుడైన సాయి స్వామిని కరుణించిన వైనాన్ని మీ కిదివరకే అందించాను. అంతటి అకుంఠిత సాయి సేవకునికి సాయి ఏయే రూపాలలో దర్శన మిచ్చినది బాబా కృపతో ఇప్పుడు మీ కందిస్తాను. స్వామీజీ షిరిడీకి చేరిన క్రొత్తలో ఒకనాటి వెన్నెల రాత్రియందు లెండీబాగ్‌లో పిట్టగోడ దగ్గర ధ్యానం చేసుకుంటున్న స్వామికి నంద దీపానికి, దత్తాత్రేయ మందిరానికి మధ్యన బండ మీద కూర్చొని దర్శన మిచ్చారు బాబా. స్వామీజీ అది తన భ్రాంతి యని తలచి కొన్ని క్షణాల తరువాత మరల చూడగా తిరిగి అదే విధంగా దర్శనమైనది. స్వామీజీ అతి సమీపానికి వెళ్ళి చూడగా బాబా అంతర్ధాన మయ్యారు.

వేరొక పర్యాయం స్వామీజీ గురుస్థాన్‌లో ఉండగా ఒక కుష్టురోగి వచ్చి బాబా తీర్థం ఇవ్వమని అడగగా స్వామీజీ తమ గదిలో బకెట్టులో గల బాబా తీర్థాన్ని ఇవ్వగా అదికాదు బాబా మహాసమాధి దగ్గర రాత్రులందు పెట్టిన తీర్థం ఇవ్వమని అడిగాడు. తన దగ్గర ఆ తీర్థం గలదని అతనికి ఎలా తెలిసిందా అని ఆలోచిస్తూ గదిలోకి వెళ్ళి తీర్థం తీసుకు వచ్చేసరికి ఆ వ్యక్తి కనుమరుగయ్యాడు. ఆ వ్యక్తి కోసం ఎంత వెతికినా ప్రయోజనం లేకపోయింది. స్వామి దగ్గర ఆ తీర్థం ఉన్న సంగతి ఇతరులకు తెలియదు ఆ తీర్థమే కావాలని అడిగిన వ్యక్తి బాబాయే నని స్వామీజీ తెలిపారు.

స్వామీజీ చావడిలో శ్రీ భరద్వాజ గారు రచించిన ''సాయిలీలామృతం'' పారాయణ చేస్తుండగా చక్కటి దుస్తులు ధరించి బూటుతోనే చావడిలోకి ప్రవేశించి ''ఏమి చదువుతున్నావు, భరద్వాజ రచించిన లీలామృతమా బాగుంది, చదువు'' అని ఆశీర్వదించినది బాబాయే నని సాయి భక్తులందరికి విదితమే.

మరొక పర్యాయం స్వామీజీ విరేచనములతో బాధపడుతుంటే ఒక ఆజాను బాహుడు స్వామీజీ గదిలోకి వచ్చి నిమ్మకాయను దిగతుడిచి స్వామీజీ ప్రేగుని తన చేతితో నొక్కి ''**నీ విరేచనములు పోయినవి, నీవు నిత్య కృత్యములు నిర్విఘ్నంగా చేసుకో. ఈ దిగదుడిచిన నిమ్మకాయను ధునిలో వెయ్యి**'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు. ఆయన వాక్కుయొక్క మహిమతో స్వామీజీ విరేచనములు తగ్గి స్వస్థత పొందారు. స్వామీజీకి ఏవిధమైన కష్టం

కలిగినా సాయినాథుడు ఏదో ఒక రూపంలో వచ్చి స్వామీజీ కష్టాన్ని కడతేర్చి ''నీ చెంత నేను ఉన్నాను'' అని నిరూపించేవారు.

## సమాధి :

అవతార పురుషులకు, మహనీయులకు, దైవాంశ సంభూతులకు మరణ మున్నదే లేదు. వారి అవతార కార్యక్రమం ముగిసిన పిమ్మట దేహ త్యాగం చేసినా వారి నాశ్రయించిన వారిని సదా రక్షించుట కొరకు ఎల్లవేళలా జాగరూకులై ఉందురు. వారి జనన మరణాలు మానవ మాత్రులమైన మన ఊహ కందనివి. మృత్యువే వారి చెంత చేరటానికి భయపడుతుంది కాని వారు మాత్రం మృత్యువుకు భయపడరు. వారు ఆహ్వానిస్తే తప్ప మృత్యువు సహితం వారి ఛాయలకు చేర సాహసించలేదు. జన్మించిన ప్రతి ప్రాణి మరణించాలన్న ప్రకృతి ధర్మానికి కట్టుబడి మాత్రమే వారు దేహత్యాగం చేస్తారు. పరిపూర్ణ అవతార పురుషులు వారి మహా సమాధి అనంతరమే అసంఖ్యాక లీలలను ప్రకటించి సర్వదా వారి భక్తుల నుద్ధరిస్తుంటారు. షిరిడీ సాయి నాథుని అవతారమే ఇందుకు ఒక ప్రబల నిదర్శనము. బాబా మహాసమాధి చెందిన మరుక్షణం నుంచే తాను సర్వదా సజీవుడనేనని నిరూపించిన లీలలు కోటానుకోట్లు గలవు. భగవంతుని యొక్క పరిపూర్ణ అనుగ్రహానికి పాత్రులైన భక్తులకు మరణముండదని భగవంతు డున్నంత వరకు వారు ఉంటారని, నామదేవు, గోణాయి, తుకారాం, రామదాసాది భక్తుల జీవితాలు చాటి చెపుతున్నాయి. సూర్య కిరణాలు సూర్యుని నుంచి దూరం కానట్లు, వెన్నెల చంద్రుని నుంచి దూరం కానట్లు, భగవంతుడు తన భక్తులకు దూరం కాక పోగా వారి

హృదయాలలోనే స్థిర నివాస మేర్పరచు కుంటాడు. భగవంతునికే వారి హృదయంలో ఆశ్రయం కల్పించిన వారి చెంతకు మృత్యువు చేర సాహసించునా! మాయచే ప్రభావితులమైన మానవులు మహనీయులు జనన మరణాల కతీతులని గ్రహించలేక వారు మరణించారనియు, మహాసమాధి చెందారని తలుస్తారు. భగవద్భక్తు లెప్పుడు మృత్యుంజయులే.

సాయి బాబా సమాధి చెందటానికి కొన్ని సంవత్సరాలు ముందు నుంచే వారు సమాధి చెందు విషయాన్ని భావ గర్భితంగా వెల్లడించినా బాబా మహాసమాధి చెందిన తరువాత మాత్రమే వారి మాటల కర్థం స్ఫురించింది వారి భక్తులకు. మన స్వామీజీ మహాసమాధి చెందు విషయాన్ని అవధూతలు సహితం ముందుగానే సూచించారు. మరి కొంతమందికి స్వామీజీ స్వప్నంలో తాము సమాధి చెందు విషయాన్ని ముందుగానే సూచించారు. 1995 సెప్టెంబరు మాసంలో శ్రీ మణి అనారోగ్యంతో బాధ పడుతుంటే స్వామీజీ అతనిని దత్తావధూత సతీ అనసూయా మాత దర్శనానికి పరాడ్ శింగా పంపగా అనసూయా మాత షిరిడీ పీఠం 5 మాసాల్లో ఖాళీ అవుతుందని సైగల ద్వారా తెలియ జేసారు. శ్రీ మణి తాను అనారోగ్యంతో బాధపడతుండటంతో 5 మాసాల్లో తానే మరణిస్తానని తలంచాడు. కానీ 5 మాసముల తరువాత ఫిబ్రవరి 12వ తేదీ 1996న స్వామిజీ సమాధి చెందిన తరువాత గానీ అతనికి అనసూయ మాత స్వామి సమాధి చెందుతారని యెరింగించిన వైనం గ్రహించాడు.

ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజగారి బుక్‌స్టాల్‌లో మేనేజరుగా పనిచేస్తున్న శ్రీ రావుకు స్వామీజీ స్వప్న దర్శన మిచ్చి తాము మహాసమాధి చెందు విషయాన్ని ఈక్రింది విధంగా తెలియ జేసారు. అతనికి స్వప్నంలో సాయినాథుడు ఒక ఆసనం మీద ఆసీనులై దర్శనమిచ్చారు. అటుపిమ్మట కొద్దిక్షణాల్లోనే అదే ఆసనం మీద స్వామీజీ దర్శన మిచ్చారు. తరువాత సాయి మరియు స్వామీజీ ఆ ఆసనానికి ఇరువైపులా నిలబడి దర్శన మివ్వగా ఖాళీ అయిన ఆసనాన్ని చూసిన శ్రీ రావు ఆ ఆసనాన్ని ఏమి చేయమంటారని స్వామీజీని ప్రశ్నించగా ''దానిని తీసుకుని పోయి ఆశ్రమంలో పెట్టు'' అని సెలవిచ్చారు. దీనిని బట్టి స్వామీజీకి తాము శరీర త్యాగము చేస్తున్న సంగతి ముందుగానే తెలుసుననియు, తరువాత తాము సూక్ష్మరూపంలో ఆశ్రమంలో ఉంటామని ముందుగానె సూచించారు.

బాబా మహాసమాధి చెందటానికి 17 రోజుల ముందు నుంచి ఆహారాన్ని విసర్జించి విజయదశమి పర్వదినాన మహాసమాధి చెందగా, స్వామీజీ కూడా తమ మహాసమాధికి 17 రోజుల ముందు నుంచి అన్న పానీయాలను విడనాడి ఫిబ్రవరి 11వ తేది ముగిసి 12వ తేదీ ప్రవేశించిన 10 నిమిషాలకు మాఘ బహుళ సప్తమి, సోమవారం అంతిమ శ్వాస విడిచి సాయి పవిత్ర పాద సన్నిధికి చేరుకున్నారు.

జనవరి 24, 1996 నుండి స్వామీజీ అస్వస్థతలకు గురై తమ జీవిత పరి సమాప్తిగావించుటకు సమయ మాసన్న మైనదని గ్రహించి

ఆ మరుసటి దినమే తాము నివసిస్తున్న గురుస్థానం లోని గదిని ఖాళీచేసి గోరాడియా మరియు ఎ.బి.యస్. హోటళ్ళ మధ్యన గల చిన్న గృహంలోకి తమ మకాంను మార్పించారు. స్వామీజీకి క్యాన్సర్ సోకిన విషయం స్వామీజీని పరీక్షించిన వైద్యుల కంటే ముందుగానే స్వామీజీ తెలియ జేసారు. మరణానికి ఏ మాత్రం వెరువక బాబా తనచే సేవ చేయించుకోవాలంటే బాబాయే తనను రక్షిస్తాడని, తాను మాత్రం ఏ వైద్యం చేయించుకోనని, మందులు వాడనని, తమ భారాన్ని బాబా పై వేసి, బాబా నామస్మరణ యందు మనసును లగ్నం చేసి బాబా పవిత్ర పాదాల లో ఐక్యం చెందటానికి స్వామీజీ ఎదురు చూడసాగారు.

స్వామీజీ అస్వస్థకు గురైన సంగతి తెలుసుకుని స్వామీజీ భక్తులు అసంఖ్యాకంగా షిరిడీకి రాసాగారు. స్వామీజీ వారందరినీ ధైర్యంగా ఉండమని వారందరిని వెంటనే తమ తమ స్వస్థలాలకు వెళ్ళి నామ సప్తాహాలు, అన్న దానం చేయమని, అదియే తమకు చివరి ఘడియలలో మనశ్శాంతిని ప్రసాదిస్తుందని చెప్పగా స్వామీజీ ఆజ్ఞను స్వప్నంలో సహితం ఉల్లంఘించని వారి భక్తులు స్వామీజీ ఆజ్ఞను అక్షరాలా పాటించారు.

షుమారు నాలుగున్నర దశాబ్దాలు నిస్వార్థ సాయి సేవలో తమ జీవితాన్ని గడిపి అతి నిరాడంబర జీవితాన్ని కొనసాగించి సాయి ఉచ్ఛిష్టంతోనే క్షుద్బాధను తీర్చుకుని దాహం తీర్చుకోడానికి సహితం సాయి పాదోదకాన్నే గ్రోలి సాయి నాథుడు చరించిన పరమ పవిత్ర ప్రదేశాల్లోనే తమ జీవితాన్ని గడిపి సాయి తత్త్వాన్ని దేశ, విదేశాలలో



పూజ్య శ్రీ శివనేశన్ స్వామీజీ మహా సమాధి - షిరిడీ

సహితం ప్రచారం చేసిన పుణ్యమూర్తి శ్రీ శివనేశన్ స్వామీజీ. స్వామీజీ తమ అంతిమ శ్వాసను విడిచారన్న సంగతి తెలుసుకొని వారి భక్తులందరూ షిరిడీ చేరి తమ గురుదేవులకు శ్రద్ధాంజలి ఘటించారు.

ప్రతి నిత్యం భక్తుల కోలాహలంతో సాయి నామ సంకీర్తనలతో కళ కళలాడే షిరిడీ పురం ఆనాడు కళావిహీనమై, నిస్తేజమై, అమావాస్య నాటి అంధకారాన్ని తలపిస్తూ, ఇది షిరిడీ పురమా, లేక శోక సంద్రమా అన్న రీతిని గోచరించింది. ఎవ్వరి ముఖంలోనూ కళా కాంతులు లేవు. వెక్కి వెక్కి ఏడ్చేవారు కొందరైతే వారిని ఓదార్చేవారు మరి కొందరు. స్వామీజీ ప్రతిభా పాటవాన్ని కొనియాడే వారు కొందరైతే స్వామీజీకి బాబా యందు గల భక్తి శ్రద్ధలను మననం చేసుకొనే వారు మరి కొందరు, ''నా తండ్రిలేని ఈ లోకంలో నాకేమి పని అని విలపించే పుత్ర సమానులు కొందరు. నా గురువు సద్గురువు సన్నిధికి చేరుకున్నారు, నా అజ్ఞానాంధకారాన్ని పారద్రోలే దెవరని రోదించే శిష్యులు కొందరు, నా దైవమే లేని నాయీ జీవితమెందుకని'' విలపించే భక్తుల ఆర్తనాదాలతో షిరిడీ పురము కాంతి విహీన మయింది.

ఆ రోజు సాయంత్రము స్వామీజీ పవిత్ర దేహానికి శాస్త్రోక్తంగా పూజలు జరిపించి సుందరంగా అలంకరించి జీపులో షిరిడీ పురవీధుల గుండా (మారుతీ మందిర్, చావడి, మహల్సాపతి గృహం, కానిఫ్‌నాథ్ మందిర్, గురుస్థాన్, బూటీవాడా, లెండీబాగ్, గణపతి, శని, శంకర దేవాలయాలు) స్వామీజీ ప్రతినిత్యం చావడిలో గానం చేసే భజనలతో, సాయి నామ సంకీర్తనలతోనూ, పుష్పాలు జల్లుతూ, హారతులిస్తూ,

స్వామీజీ ఆశ్రమం కోసం క్రయం చేసిన స్థలానికి తీసుకు వెళ్ళి వేద పురోహితులచే శాస్త్రోక్తంగా స్వామీజీ అంత్య క్రియలు వారు జరిపించారు. శ్రీ. కె. ఎస్. సుబ్రహ్మణ్యం(మణి) స్వామీజీకి అంత్య క్రియలు చేసారు. స్వామీజీ పవిత్ర దేహానికి అగ్ని సంస్కారం జరిపించి భక్తులందరు బాధా తప్త హృదయంతో బాధ పడటం చూడలేని సూర్యుడు సహితం అస్తమించాడు. స్వామీజీ భక్తులు స్వామీజీ అస్తికలను భారత దేశంలో గల అన్ని పవిత్ర నదీ జలాల్లో నిమజ్జనం చేసి స్వామీజీ యందు వారికి గల భక్తి ప్రపత్తులను చాటుకున్నారు. స్వామీజీ సమాధిని 21-2-96న నిర్మించారు. ఈ పరమ పూజ్యుని మహాసమాధి పింపుల్‌వాడి (ప్రసాదాలయ) రోడ్డులో ప్రసాదాలయం నుంచి 2½,కి.మీ. దూరంలో గలదు. స్వామీజీకి అంత్య క్రియలు చేసిన శ్రీ మణిస్వామి మహాసమాధికి ప్రతి నిత్యం అభిషేకం, ధూప, దీప నైవేద్యాలను సమర్పిస్తున్నారు. షిరిడీకి వచ్చే స్వామి భక్తులందరూ స్వామీజీ మహాసమాధిని సందర్శించి ఆశీస్సులు పొందుతున్నారు. అతి త్వరలోనే స్వామీజీ మహాసమాధికి ఒక సుందరమైన మందిరాన్ని నిర్మించాలన్న స్వామీజీ భక్తుల కోర్కెను సాయినాథుడు మరియు స్వామీజీ తీర్చాలని వేడుకుందాము.

బాబా మహాసమాధి చెందిన తరువాత అసంఖ్యాక లీలలను ప్రదర్శించి కోటానుకోట్ల మంది కోర్కెలను తీర్చి తన భక్తులుగా మార్చుకొన్న రీతిలోనే మన స్వామీజీ కూడా వారి భక్తుల బాధలను తీరుస్తూ, కాపాడుతున్నవైనాన్ని ''మహా సమాధి అనంతర లీలలు''లో చదివి తరించగలరు.

## మహాసమాధి అనంతర లీలలు :

స్వామీజీ మహాసమాధి చెందిన అనంతరం తాము ఎన్నటికి సజీవులమే నని తెలియ జేయుటకు వారి భక్తులకు సశరీరులుగాను స్వప్నాలలోను దర్శన మొసంగి వారి బాధలను బాపుతున్న వైనాన్ని స్వామీజీ ఆశీస్సులతో మీ కందిస్తున్నాను.

స్వామీజీ భక్తుడైన గోవా నివాసియగు చాందోర్‌కర్ మేనల్లునికి స్వామీజీ సశరీరులుగా దర్శన మిచ్చి ''నన్ను గుర్తుపట్టావా?'' అని ప్రశ్నించారు. అతను వెంటనే ''మీరు శివనేశన్‌స్వామీజీ, మీరు నాకిచ్చిన పాటల పుస్తకాన్ని నేను నా పూజా మందిరంలో పెట్టి పూజించు కుంటున్నాను.'' అని సమాధాన మిచ్చాడు. స్వామీజీ అతనికి రెండు రూపాయల నోటును గుప్పిటలో పెట్టి గుప్పిటను మూయమన్నారు. తరువాతగుప్పిటను తెరువగా అందులో రెండు రూపాయలకు బదులు గులాబీ పుష్పం ఉంది. ఇంతలోనే వేరొక ఫకీరు వేషధారి వచ్చి తాను మహారాష్ట్రం నుంచి వస్తున్నట్లు చెప్పి తనకు అయిదు రూపాయలు కావాలని అడుగగా ఆ యువకుడు తన జేబులోంచి తీసి ఇవ్వబోగా ఇవి కాదు నీ దుకాణం లోంచి తీసుకొచ్చి ఇవ్వు అని అతని దుకాణం వైపు చేయి చూపించాడు. అతను వెంటనే దుకాణానికి వెళ్ళి అయిదు రూపాయలు తెచ్చి ఇవ్వగా అతనిని ఆశీర్వదించి స్వామి మరియు ఆ ఫకీరు వేషధారి కొద్ది దూరం వెళ్ళి అతను చూస్తుండగానే కనుమరుగయ్యారు.

షిరిడీ నివాసియగు కుమారి దేశ్ ముఖ్ గారికి స్వామీజీ ప్రసాదించిన మరొక అనుభవము-

1995 ఆగస్టు లేక సెప్టెంబరు మాసంలో ఈమె దగ్గు, వాంతులతో బాధ పడుతుంటే స్వామీజీ త్రిఫల చూర్ణము మరియు అల్లంతో తయారు చేసిన ఒక చాక్లెట్టును ఇచ్చారు. వాటిని సేవించగా రెండు రోజులకే స్వస్థత పొందింది. స్వామీజీ మహాసమాధి చెందిన తరువాత మార్చి 9వ తేదీ 1996న తిరిగి దగ్గు, వాంతులు కావటంతో ఆమె స్వామీజీని తల్చుకొని ''స్వామీ ఇదివరకు ఈ వ్యాధిని మీరే నయం చేసారు ఇప్పుడు నాకు దిక్కెవ్వరు?'' అంటూ స్వామిని ప్రార్థించి నిదురించగా స్వామీజీ స్వప్నంలో దర్శన మిచ్చి ఆమెకు అంతకు ముందు ఇచ్చిన చాక్లెట్టు వంటిదే ఇచ్చి అంతర్ధాన మయ్యారు. తెల్లవారిన తరువాత నిద్రలేచి ముఖ ప్రక్షాళనం చేసుకొంటూ రాత్రి స్వామీజీ చాక్లెట్టు ఇచ్చిన సంగతి గుర్తుకు వచ్చి చూడగా మంచం మీద చాక్లెట్టు ఉన్నది. దానిని తీసుకొని కళ్ళు కద్దుకొని నోట్లో పెట్టుకొని చప్పరించగా కొద్ది క్షణాలలోనే ఉపశమనం కలిగింది. ఆమె ఉద్యోగానికి వెళ్ళే సమయం కావటంతో తొందరగా స్నాన మాచరించి ఆఫీసుకు వెళుతుంటే స్వామీజీ సమాధి చెందారుగదా మరి రాత్రి చాక్లెట్టు ఎవ్వరు ఇచ్చారన్న సందేహం కలిగింది. అది స్వప్న మని సరిపెట్టు కుందామంటే స్వప్నంలో ఇచ్చిన చాక్లెట్టు స్వయంగా తన మంచం మీదకు ఎలా వచ్చిందని ఆశ్చర్యపడి అది స్వామి ప్రసాదించిన ప్రసాదమని గ్రహించింది. తనను నమ్ముకున్న వారిని స్వామీజీ ఏనాడు అలక్ష్యం చేయరని ఈ సంఘటన ఋజువు చేస్తోంది.

స్వామీజీ మహాసమాధి చెందిన తరువాత శివరాత్రి గడిచిన రెండు రోజులకు హైదరాబాదు వాస్తవ్యులగు శ్రీయుతులు రాజు మరియు రామారావు అనే ఇరువురు భక్తులు షిరిడీకి వెళ్ళి ధునికి నమస్కరిస్తుండగా స్వామీజీ మేస్త్రీలు ప్లాస్టరింగ్ చేయుటానికి ఉపయోగించే బద్దను భుజాన పెట్టుకొని దార్వకామాయి నుంచి బూటీవాడాకు వెళ్ళుతూ దర్శన మివ్వగా వారు స్వామిని అనుసరించగా బూటీవాడా లోనికి ప్రవేశించగానే స్వామీజీ అంతర్ధాన మయ్యారు.

షిరిడీ నివాసి యగు శ్రీమతి పల్లవిషా( గ్రీన్ హోటల్, చావడి దగ్గర) స్వామీజీ సశరీరులుగా ఉన్నప్పుడు స్వామీజీతో ప్రతిరోజూ గురుస్థానానికి ప్రదక్షిణలు గావించేవారు. స్వామీజీ మహాసమాధి చెందిన తరువాత కూడా ప్రదక్షిణలు చేస్తుంటే ఈమెకు కొద్ది దూరం ముందుగా స్వామీజీ ప్రదక్షిణలు చేస్తున్నట్లు అనేక పర్యాయములు అనుభూతి కలిగినట్లు తెలియ జేసారు.

శ్రీ షి. యస్. రావు, షిరిడీ, వారి నివాస గృహంలో పూజా మందిరంలో దేవతా చిత్రపటాలతో పాటు స్వామీజీ మరియు ఆచార్య శ్రీఎక్కిరాల భరద్వాజగారి చిత్రపటాలను పూజించే వారు. వీరింటికి వచ్చిన ఒక మహిళ భగవంతునితో సమానంగా స్థానం కల్పించి ఈ మానవ మాత్రులకు ఎందుకు పూజ చేస్తున్నారని శ్రీ రావు గారి అత్తగారైన శ్రీమతి రాఘవరపు రమాదేవి గార్ని ప్రశ్నించగా ఆమె ఆ రెండు చిత్రపటాలను పూజా మందిరం నుంచి తీసివేసారు. ఆనాటి రాత్రే స్వామీజీ ఆమెకు స్వప్న దర్శన మిచ్చి ఆమెను షిరిడీలోగల అన్ని

దేవతా మందిరాలను దర్శింప జేసారు. దీనితో ఆమె స్వామీజీ సామాన్య మానవుడు కాడని గ్రహించి ఆ చిత్రపటాలను తిరిగి యథాస్థానంలో ఉంచి పూజించ సాగారు.

శ్రీమతి పి. భారత లక్ష్మి (ఇంటి నెం. 5-65/1, న్యూ మారుతీ నగర్, హైదరాబాదు - 500 060) గార్కి 17.2.96న మన పూజ్య స్వామీజీ అవధూత నాంపల్లి బాబాతో కలిసి స్వప్న దర్శన మిచ్చి ''నాకు బట్టలు పెడతావా?'' అని అడిగారు. ఆమె ''పెడతాను స్వామీ'' అని సమాధాన మిచ్చారు. స్వామీజీ ఆజ్ఞను శిరసావహించి గురుపూర్ణిమ రోజున మల్లాపూర్ బాబా మందిర ప్రాంగణంలో స్వామీజీ ధ్యాన మందిరంలో నూతన వస్త్రాలను సమర్పించారు.

ఆదిలాబాదులో గల హార్టీకల్చర్ డిపార్టుమెంటులో పనిచేస్తున్న శ్రీ రవి కల్లూరు శ్రీ దత్తవెంకటసాయి ఆలయానికి వెళుతూంటే కల్లూరుకు 20 కి.మీ. దూరంలో స్వామీజీ చేతిలో రుద్రాక్ష మాలతో దర్శన మివ్వగా అతను ''ఇక్కడున్నారేమిటి స్వామీజీ'' అని అడగగా స్వామీజీ ''నాపని నేను చేసుకుంటున్నాను, నీ పని నీవు చేసుకో, కల్లూరుకు వెళ్ళు'' అని సమాధాన మిచ్చారు. ఈ సంఘటన స్వామీజీ సమాధి చెందిన తరువాత జరిగింది.

## స్వామీజీ జీవితంలో కొన్ని విశేషాలు :

స్వామీజీ జనన, మహాసమాధి తేదీలు రెండూ 12వ తేదీయే గాక వారి జననం బాబాకు అత్యంత ప్రీతికరమైన శ్రీరామనవమి కావటం మరొక విశేషం. బాబా మహాసమాధి చెందిన మంగళవారమే స్వామీజీ జనన దినం. బాబా మహాసమాధి చెందిన 8 సంవత్సరాలకు స్వామీజీ జన్మించటం మరొక విశేషం కాగా బాబా ప్రథమంగా షిరిడీ పుణ్యభూమి మీద కాలిడిన శతాబ్ద కాలానికి (1953లో) స్వామీజీ బాబా పాద ధూళిచే పవిత్రతను సంతరించుకున్న షిరిడీలో కాలిడినారు. బాబా వలెనే స్వామీజీ కూడ షిరిడీ సరిహద్దులు దాటి వెళ్ళటానికి ఇష్టపడేవారు కాదు.

బాబాను దర్శించటానికి గజానన్ మహారాజ్ వంటి మహనీయులే షిరిడీకి రాగా స్వామికి దర్శన మివ్వటానికి శ్రీ దత్త అవధూత అనసూయమాత, శ్రీ రామిరెడ్డితాత వంటి మహనీయులు షిరిడీకి వచ్చారు. స్వామీజీ జనన దినమైన శ్రీరామనవమి పర్వదినాన వారి భక్తు లనేక మంది సాయి మందిరాల నిర్మాణాన్ని విగ్రహ ప్రతిష్ఠలను గావించారు.

సాయినాథుడు ఎల్లప్పుడు ''**సబ్‌కా మాలిక్ ఏక్‌హై**'' అంటే మన పూజ్య స్వామీజీ ఎల్లవేళలా ''**సబ్ కా మాలిక్ సాయి**'' అనే వారు. తన జీవితంలోని ప్రతి క్షణాన్ని సాయి సేవకే అంకితం చేసిన ఈ పుణ్య మూర్తి జీవిత చరితానికి ''ముగింపు'' ఉండదన్న తలంపుతో

ఈ గ్రంథాన్ని మీ పవిత్ర హస్తాల కందించే భాగ్యాన్ని ప్రసాదించిన సాయినాథుని, నా ప్రాణదాత యైన పూజ్య శ్రీ శివేశన్ స్వామీజీ చరణాలకు ప్రణమిల్లి, ఈ గ్రంథాన్ని పఠించిన పాఠకులకు, వినిన శ్రోతలకు సాయి బాబా మరియు మన పూజ్య స్వామీజీ ఆయురారోగ్యముల నిచ్చి సదా రక్షించుగాక యని ప్రార్థిస్తూ.....



చావడి భజనలో నిమగ్నమైన

పూజ్య శ్రీ శివనేశన్ స్వామీజీ

# స్వామీజీ మంగళ హారతి

సాయి స్వరూపాయ- శివనేశన్ గురువరాయ
సచ్చిదానందాయ- స్వామి మంగళం
సత్య ధర్మ పాలకాయ- సాయిభక్త పోషకాయ
పూజ్య గురుపాదాయ- పూజ్య మంగళం
ప్రేమ స్వరూపాయ- పావన చరితాయ
పాపకర్మ విమోచనాయ- పరమ మంగళం
ఆశ్రిత రక్షకాయ- దీనజన బంధో
అవధూతోత్తమా- అమిత మంగళం
కారుణ్యలోచనాయ- కమనీయ రూపాయ
కార్యా కారణాయ స్వామి- కర్పూర మంగళం
సాయి తత్త్వ బోధకాయ- ముక్తిమార్గ దర్శకాయ
నిర్మలాయ విదేహాయ- నిత్య మంగళం
నిత్యాగ్ని హోత్రాయ- నిరాతాన్న దానాయ
నిర్వ కల్పాయ స్వామి- నిఖిల మంగళం
షిర్డి క్షేత్రవాసాయ- సాయి మానస వాసాయ
మత్పు సాయి అంకితాయ- మహిత మంగళం

-:-

## సాయిబాబా భజనావళి

## శ్రీ సాయి బావనీ

అవధూత చింతన శ్రీ గురుదేవదత్త
జయ ఈశ్వర జయ సాయి దయాళ।
తూహీ జగత్‌కా పాలనహార॥ 1
దత్తదింబర ప్రభూ అవతార।
తేరేబస్‌మే సబ్ సంసార॥ 2
బ్రహ్మాచ్యుత శంకర అవతార।
శరణాగత కా ప్రాణాధార॥ 3
దర్శన్ దేదో ప్రభు మేరే।
మిటాదో చౌరాసీ ఫేరే॥ 4
కఫనీ తేరే ఇక సాయా।
ఝోలీ కాంధే లటకాయా॥ 5
నీమ్‌తలే తూ ప్రకటగయా।
ఫకీర్ బన్‌కే తూ ఆయా॥ 6
కలియుగ మే అవతార లియా।
పతిత పావన తూనె కియా॥ 7
షిరిడీ గాంవ్ మే వాస కియా।
లోగోంకే మన్ లుభాలియా॥ 8
చిలంథీ శోభా హాథోంకీ।
బన్సీజైసీ మోహన్‌కీ॥ 9
దయా భరిథీ ఆంఖోంమే।
అమృతధారా బాతోంమే॥ 10
ధన్య ద్వారకా వోమాయి।
సమాగయే జహాఁ సాయి॥ 11
జల్ జాతా హై పాప్ వహాఁ।
బాబాకీ హై ధూనీ జహాఁ॥ 12

భూలా భటకా మై అంజాన్।
దే మురుఘకో తేరా వరదాన్॥ 13
కరుణా సింధు ప్రభు మేరే।
లాఖోం బైఠే దరపే తేరే॥ 14
అగ్నిహోత్రీ శాస్త్రీకో।
చమత్కార్ తూనె దిఖలాయా॥ 15
జీవనదాన శామా పాయా।
జహర్ సాంప్‌కా ఉతరాయా॥ 16
ప్రళయ్‌కాల్ కో రోక్‌లియా।
భక్తోంకో భయ ముక్త్ కియా॥ 17
మహామారీ బేనామ్ కియా।
షిరిడీ పురికో బచాలియా॥ 18
ప్రణామ్ తురుఘకో మేరే ఈశ।
చరణోమే తేరే మేరా శీష॥ 19
మన్‌కీ ఆస పూరీకరో।
భవ సాగర్ సే పార్ కరో॥ 20
భక్త్ భీమాజీ థా బీమార్।
కర్‌బైఠా థా సౌ ఉపచార్॥ 21
దన్య సాయేకీ పవిత్ర ఉదీ।
మిట్‌గయా ఉస్‌కీ క్షయ వ్యాదీ॥ 22
దిఖలాయా తూనె విఠల్ రూప్।
కాకాజీ కో స్వయం స్వరూప్॥ 23
దాముకో సంతాన దియా।
మన్ ఉసకా సంతుష్ట కియా॥ 24
కృపానిధీ అబ్ కృపాకరో।
దీన దయాళూ దయా కరో॥ 25
తన్ మన్ ధన్ అర్పణ తురుఘకో।
దేదో సద్గతీ ప్రభు మురుఘకో॥ 26

మేధా తురుఖ్‌కో న జానా థా।
ముస్లిం తురుఖ్‌కో మానా థా॥ 27
స్వయం తూ బన్‌కే శివశంకర్।
బనాదియా ఉస్కో కీకర్॥ 28
రోశనాయి కీ చరాగోంసే।
తేల్‌కే బదలే పానీసే॥ 29
జిసనే దేఖా ఆంఖో హాల్।
హాల్ హువా ఉస్కో బేహాల్॥ 30
చాంద్ భాయి థా ఉలఝన్ మే।
ఘోడేకే కారణ మన్ మే॥ 31
సాయినే కీ ఐసీ కృపా।
ఘోడా ఫర్ వహ పాసకా॥ 32
శ్రద్ధా సబురీ మనమే రఖో।
సాయి సాయి నామ్ రటో॥ 33
పూరీ హోగీ మన్‌కీ ఆస్।
కర్‌లో సాయి కా నిజధ్యాస్॥ 34
జాన్ కే ఖతరా తాత్యాకా।
దాన్ దీ అపనీ ఆయుకా॥ 35
ఋణ బయజా కా చుకాదియా।
తూనే సాయీ కమాల్ కియా॥ 36
పశు పక్షీ పర్ తేరీ లగన్।
ప్యార్ మే తూ థా ఉన్‌కే మగన్॥ 37
సబ్ పర్ తేరీ రహం నజర్।
లేతే సబ్‌కే ఖుద్ కీ ఖబర్॥ 38
శరణ మే తేరే జో ఆయా।
తూనే ఉస్కో అపనాయా॥ 39
దియే హైం తూనే గ్యారహ వచన్।
భక్తోంకే ప్రతి లేకర్ ఆన్॥ 40

కణ కణ మే తూ హై భగవాన్।
తేరీ లీలా శక్తి మహాన్॥ 41
కైసే కరూఁ తేరే గుణగాన్। -
బుద్ధి హీన్ మై హూఁ నాదాన్॥ 42
దీన దయాళు తూ దాతా।
హమ్ సబకా తూ హై త్రాతా॥ 43
కృపాకరో అబ్ సాయి మేరే।
చరణో మే లే లో తేరే॥ 44
సుబహ శామ్ సాయి కా ధ్యాన్।
సాయి లీలా కే గుణగాన్॥ 45
దృఢభక్తి సే జో గాయేగా।
పరమ పదకో వహ పాయేగా॥ 46
హర్ దిన్ సుబహ ఔర్ శామ్ కో।
గాయే సాయి బావనీ కో॥ 47
సాయి దేగా ఉసకో సాథ్।
లేకర్ అపనే హాథ్‌మే హాథ్॥ 48
అనుభవ తృప్తి కే బోల్।
శబ్ద బడే హైఁ బుద్ధి
·యహ అన్‌మోల్॥ 49
యకీన్ జీసనే మాన లియా।
జీవన్ ఉసనే సఫల కియా॥ 50
సాయి శక్తి విరాట స్వరూప్।
మన మోహక్ సాయికా రూప్॥ 51
గౌర్ సే దేఖో తుమ్ భాయి।
బోలో జయ సద్గురు సాయి॥ 52

శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాథ్ మహరాజీ కీ జయ్

శ్రీ సద్గురు సాయినాథ్ అర్పణమస్తు

శుభం భవతు

# శ్రీ సాయినాథ్ మంగళా శాసనం

మంగళం గురుదేవాయ మహనీయ గుణాత్మనే
సర్వలోక శరణ్యా సాయినాథాయ మంగళం
మహారాజాధి రాజాయ యోగిరాజాయ సాయినే
సగుణ బ్రహ్మ రూపాయ సాయిరాం నమోస్తుతే
దేవ దేవ జగద్వంద్య చంద్రాదిత్య సమప్రభ
సేవకావర్గ లీలాత్మా సాయిరామ నమోస్తుతే
భూతీ భూషిత సర్వాంగా భూతై నామయ నాశక
అధిత వేద వేదాన్ సాయిరామ నమోస్తుతే
ప్రజ్ఞానిధే కృపాసింధు సన్మార్గోన్మూలన వ్రత
పద్మ పత్ర విశాలాక్షిసాయిరామ నమోస్తుతే
కరుణారస పాదఆదేదరహాసల సమ్ముఖః
యోగిన్ యోగవిదాశ్రేష్ఠ సాయిరామ నమోస్తుతే
నిర్గుణ బ్రహ్మతత్త్వజ్ఞ నిరాకార నిరామయ
బాల భాస్కర సంకాశ సాయిరామ నమోస్తుతే
భవబంధన వినిర్ముక్త భక్తానాం అభయ ఆపద
ముఖ భుక్ ప్రవరస్తుల్య సాయిరామ నమోస్తుతే
కళ్యాణ గుణ సంపూర్ణ కరుణా వరుణాలయ
ఆపన్నాశ్రిత మందార సాయిరామ నమోస్తుతే
అఖిలామర సంసేవ్య ఆదినారాయణ ప్రియ
జీతకందర్పే సౌందర్య సాయిరామ నమోస్తుతే
యమాదినియమోపేత యతీశ్వర నిసేవితా
గాంభీర్యమేరు శైలేంద్ర సాయిరామ నమోస్తుతే
రాజీవ గర్భ సంకాస రాజీవ దళలోచన
రక్షతాన్న సదా సాయిన్ సాయిరామ నమోస్తుతే
అష్టమూర్తి స్వరూపాయ అష్టసిద్ధి ప్రదాయినే

పరబ్రహ్మ స్వరూపాయ సాయిరామ నమోస్తుతే
వర్జితాఖిల సంసార ద్వారకామాయి వాసినే
పవిత్ర గుణ గంభీర సాయిరామ నమోస్తుతే
మంగళం సాయినాథాయ మంగళం కరుణాత్మనే
మంగలం భక్త సేవాయ షిరిడీ వాసాయ మంగళం

- : -

## గురుదత్త దిగంబర తవ శరణం

గురుదత్త దిగంబర తవ శరణం
దాతా దత్త దిగంబర తవ శరణం ॥గురు॥
అత్రిసూత అనసూయ నందన
యోగిరాజ గురు తవ శరణం ॥గురు॥
శ్రీపాద శ్రీవల్లభ యతీవర
నరసింహ సర్వతీ తవ శరణం ॥గురు॥
కార్తవీర్య భుక్తి ముక్తిప్రద
పింగళ పూజిత తవ శరణం ॥గురు॥
గోరఖ గర్వ వినాశక దాతా
అవధూత నిరంజన తవ శరణం ॥గురు॥
హీన దీన తారక పురుషోత్తమ
వాసుదేవ గురు తవ శరణం ॥గురు॥
ఏకనాథ జనార్ధన స్వామీ
అక్కలకోట గురు తవ శరణం ॥గురు॥
దాసోపంత్ యవన నృపతారక
సిద్ధ సర్వతీ తవ శరణం ॥గురు॥
పూర్ణ పరాత్పర సగుణ గుణేశ్వర
నిరాకార గురు తవ శరణం ॥గురు॥

నీలకంఠ ఆలంబక నూరో
సాయీనాథ గురు తవ శరణం ॥గురు॥
నారాయణ భైరవ మాణిక్ ప్రభు
రంగ తార గురు తవ శరణం ॥గురు॥

-:-

## సదా భజో గురుదేవ

సదా భజో గరు దేవ గురు బిన నహి కోయీ ఆపనా
నాతే గోతే సబ్ స్వారథ్‌కే నిస్వారథ గరురాణా
ఆప సమాన్ కరే శిష్యన్‌కో దేవే పద నిరబానా
కరే లోహ కా పారస సోనా నహి పారస కర జానా
నహీ ఉపమా గురుకీ త్రిభువనమే సాక్షాత్ దేవ పిఛానా
పుఛో పండిత్ పోథీ దిఖానే కాజి కితాబ్ కహన
బోలె అంధా దౌడో పీఛే సబ్ మతలబ్‌మే స్యానా
కథే జ్ఞాన ఔర్ క్రియా సిఖానే పకడ్ దస్త్ సలూనా
ఘాట్ ఆగమ్‌పే ఆప చఢాలే జహాఁ సాయికా థానా
బినా తేల్ జలే జహాఁ జ్యోతీ జగమగ దివసారైనా
ఆఠో యామ్ బజే సురబాజా రంగ్ అరంగి జానా

-:-

## దీనోంకా పాలన కరో

దీనోంకా పాలన కౌనుకరే? సాయిరాం బినా దుఃఖ
కౌన్ హరే ।ధృ।

కౌన్ హై ఆపనా? సభీ పరాయే
బుఝె దియే కో కౌన్ జలాయె?
భరీ హుయి గాగర్ సబ్ ఛులె
ఖాలీ గాగర్ కౌన్ భరే

జగ్ హై ఐసా గోరఖ ధందా
ఔర్ ఉలఝుతా ఔతా బందా
కైసే జాఁ ఊ ద్వార తిహారే?
హగ్ హగ్ భైతే పహారే

## అబ్ సోంప్ దియా

అబ్ సోంప్ దియా ఇస్ జీవన్ కా సబ్ భార్ తుమ్హారే
హాథోమే

సాయినాథ్ తుమ్హారే చరణోమే హై
జీత్ తుమ్హారే హాథో మే ఔర్ తుమ్హారే హాథోమే
సాయినాథ్ తుమ్హారే చరణోమే హై
మేరా నిశ్చయ బస్ అబ్ ఏక్ యహి ఏక్ బార్ తురెఝ పా
జాఊఁ మై
అర్పణ కర్ దూఁ దునియా భర్‌కా సబ్ ప్యార్ తుమ్హారే
హాథోమే
సాయినాథ్ తుమ్హారే చరణోమే హై
మై జగ్‌మే రహూఁతో ఐసే రహూఁ జైసే జల్ మే కలమ కా
ఫూల్ రహే
మేరే అవగుణ దోష సమర్పిత హై కరతార్ తుమ్హారే హాథోమే
సాయినాథ్ తుమ్హారే చరణోమే హై
యది మానవకా ముఝే జనమే మిలేతో తబ్ చరణోంకా
పూజారీ బనూ
ఇస్ పూజక్‌కే ఇక్ రగ్‌కా హో హర్ తుమ్హారీ హాథోమే
సాయినాథ్ తుమ్హారే చరణోమే హై
ముఝుమే తుఝుమే బస్ భేద్ యహీ మై నర్ హూఁ తుమ్
నారాయణ్ హో
మై హూఁ సంసార్‌కే హాథోమే సంసార్ తుమ్హారే హాథోమే

సాయినాథ్ తుమ్హారే చరణోమే హై
హమ్ తుమ్‌కో కభీ నహీ భజతే ఫిర్‌భీ తుమ్ హమ్‌కో
నహీత్యజతే
ఆప్‌కార్ హమారే హాథోమే ఉపకార్ తుమ్హారే హాథోమేం
సాయినాథ్ తుమ్హారే చరణోమే హై

-:-

## హరిద్వార్, మథురా, కాశీ

హరిద్వార్, మథుర, కాశీ షిరిడీ మే తీర్థ సారె హై
సాయిబాబాకే చరణోమే చారోం ధామ్ హమారే హై
సబ్ సంతోమే మహసంత్ సాయి దునియాసే నారేహ
నరనారీ బాలక్ బూఢే సబ్ హీ కో సాయి ప్యారే హై
మురఖ్‌హో యా అజ్ఞానీ, పండిత్‌హో, చాహె విద్వాన్
ఏక్ నజరేసే దేఖే సాయి సబ్‌కో దేతేహైం వరదాన్
కోఁ౯ బిగాడ్ సకే ఉసకా జిసకే సాయి రఖవాలే హై
మహరాష్ట్రకీ పావన భూమి ఇసకో కోటి ప్రణామ్‌హై
ఇసకీ మాటీకే కణకణమే లిఖా తుమ్హారా నామ హై
తేరే మందిర్‌మే ఆతేతో దునియాసే క్యా కామ్ హై
షిరిడీ హమారా బృందావన్‌హై షిరిడీ గోకుల ధామ్ హై
సాయి హమారే కృష్ణ కన్హైయా, సాయి హమారే రామ్ హై

-:-

# సాయినాథ్ తేరే చరణోఁసే

సాయిథ్ తేరే చరణోఁసే హమ్‌కో న జుదా కరనా
జబ్ యాద్ తేరీ ఆయె మిలన్‌కీ దయా కరనా
నామై తపసీ నా జ్ఞానీ, నామై యోగీ నా ధ్యానీ
తూ మాత్ పితా మేరా మై హూఁ బాలక్ అజ్ఞానీ
సాయి మేరే దోషోఁ పర్ మత్ ఖయాల్ కియా కరనా
ఫంస్‌కే జగ్ మాయామే జో మై కభీ భరమా జాఊఁ
జో భూల్ తుఝొ సాయిజీ ఖోటె రస్తే చలా జాఊఁ
తో వేగ్ సాయిజీ ఆకె మెహథామ్ లియా కరనా
మఝుథార్ పడి నైయ్యా నహీ ఖేవనహరా కోయి
హై ఏక్ సహరా తేరా మేరా నహీ జగ్ మే కోయి
తూ బన్‌కే సుకామీ సాయిజీ మోహే పార్ కియాకరనా
కిత్ ద్వార్ తేరా త్యజకే రాజేశ్వర్ జా ఊఁ మై
ఫరియాద్ కిసే అపనీ రో రో కే సునా ఊఁ మై
ఆవాజ్ మేరీ సున్‌కే సహచాన్ లియా కరనా

-:-

# శ్రీ సాయి చాలీసా

షిరిడీవాస సాయి ప్రభో ॥ జగతికి మూలం నీవే ప్రభో॥
దత్త దిగంబర అవతారం ॥ నీలో సృష్టి వ్యవహారం॥
త్రిమూర్తి రూపా ఓ సాయి ॥ కరుణించి కాపాడోయి॥
దరిశనమీయగా రావయ్యా ॥ ముక్తికి మార్గం చూపుమయా ॥షిరిడీ॥
కఫినీ వస్త్రము ధరియించి ॥ భుజమునకు జోలి తగిలించి ॥
నింబ వృక్షపు ఛాయలో॥ ఫకీరు వేషపు ధారణలో ॥
కలియుగమందున వెలిసితివి ॥ త్యాగం సహనం నేర్పితివి ॥
షిరిడీ గ్రామం నీవాసం ॥ భక్తుల మదిలో నీ రూపం ॥షిరిడీ॥
చాంద్‌పాటిల్‌ను కలుసుకొని ॥ అతని బాధలు తెలుసుకొని ॥
గుర్రము జాడను తెలిపితివి ॥ పాటిల్ బాధను తీర్చితివి ॥
వెలిగించావు జ్యోతులను ॥ నీవుపయోగించి జలము ॥
అచ్చెరువొందెను గ్రామం ॥ చూసి వింతైన దృశ్యం ॥ షిరిడీ॥
బాయిజా చేసెను నీ సేవ ॥ ప్రతిఫలమిచ్చావో దేవా ॥
నీ ఆయువును బదులిచ్చి ॥ తాత్యాను నీవు బ్రతికించి ॥
పశు పక్షులను ప్రేమించి ॥ ప్రేమతో వాటిని లాలించి ॥
జీవులపైనా మమకారం ॥ చిత్రమయా నీ వ్యవహారం ॥ షిరిడీ॥
నీ ద్వారములో నిలిచితిని ॥ నిన్నే నిత్యము కొలిచితిని ॥
అభయమిచ్చి బ్రోవుమయా ॥ ఓ షిరిడీశా దయామయా ॥
ధన్యము ద్వారక ఓ మాయి ॥ నీలో నిలిచెను శ్రీ సాయి ॥
నీ ధుని మంటల వేడిమికి ॥ పాపము పోవును తాకిడికి ॥ షిరిడీ ॥
ప్రళయ కాలము ఆపితివి ॥ భక్తులను నీవు బ్రోచితివి ॥
చేసి మహమ్మారీ నాశం ॥ కాపాడి షిరిడీ గ్రామం ॥
అగ్నిహోత్రి శాస్త్రికి ॥ లీలా మాహాత్మ్యం చూపించి ॥
శ్యామాను బ్రతికించితివి ॥ పాము విషము తొలగించి ॥షిరిడీ॥
భక్త భీమాజీకి క్షయరోగం ॥ నశియించే అతని సహనం ॥
ఊది వైద్యం చేసావు ॥ వ్యాధిని మాయం చేసావు॥
కాకాజీకి ఓ సాయి ॥ విఠల దర్శన మిచ్చితివి ॥
దామూకిచ్చి సంతానం ॥ కలిగించితివి సంతోషం ॥ షిరిడీ ॥

కరుణా సింధూ కరుణించి ॥ మాపై కరుణా కురిపించు ॥
సర్వం నీకే అర్పితము ॥ పెంచుము భక్తి భావమును ॥
ముస్లిమనుకొని నిను మేఘా ॥ తెలుసుకొని అతని బాధ ॥
దాల్చి శివశంకర రూపం ॥ ఇచ్చావయ్యా దర్శనము ॥ షిరిడీ ॥
డాక్టరుకు నీవు రామునిగా ॥ బల్వంతుకు శ్రీ దత్తునిగా ॥
నిమోను కొరకు మారుతిగా ॥ చిదంబరకు శ్రీ గణపతిగా ॥
మార్తాండ్‌కు ఖండోబాగా ॥ గణూకు సత్యదేవునిగా ॥
నరసింహస్వామిగ జోషికి ॥ దరిశన మిచ్చిన శ్రీ సాయి ॥
రేయి పగలు నీ ధ్యానం ॥ నిత్యం నీ లీలా పఠనం ॥
భక్తితో చేయండీ ధ్యానం ॥ లభియించును ముక్తికి మార్గం ॥
పదకొండూ నీ వచనాలు ॥ బాబా మా కవి వేదాలు ॥
శరణని వచ్చిన భక్తులను ॥ కరుణించి నీవు బ్రోచితివి ॥ షిరిడీ ॥
అందరిలోనూ నీ రూపం ॥ నీ మహిమా అతి శక్తిమయం ॥
ఓ సాయి మేము మూఢులము ॥ ఒసగుమయా నీవు జ్ఞానమును ॥
సృష్టికి నీవేనయ మూలం ॥ సాయి మేము సేవకులం ॥
సాయి నామము తలచెదము ॥ నిత్యము సాయిని కొలిచెదము ॥షిరిడీ॥
భక్తిభావన తెలుసుకొని ॥ సాయిని మదిలో నిలుపుకొని ॥
చిత్తముతో సాయీ ధ్యానం ॥ చెయ్యండి ప్రతి నిత్యం ॥
బాబా కాల్చిన ధుని ఊది ॥ నివారించును అది వ్యాధి ॥
సమాధి నుండి శ్రీ సాయి ॥ భక్తులను కాపాడేనోయి ॥ షిరిడీ ॥
మన ప్రశ్నలకు జవాబులు ॥ తెలుపును సాయి చరితములు ॥
వినండి లేక చదవండి ॥ సాయి సత్యము చూడండి ॥
సత్సంగము చేయండి ॥ సాయి స్వప్నం పొందండి ॥
భేద భావమును మానండి ॥ సాయీ మన సద్గురువండీ ॥షిరిడీ ॥
వందనమయ్యా పరమేశా ॥ ఆపద్బాంధవ సాయీశా ॥
మా పాపములు కడతేర్చు ॥ మా మది కోరిక నెరవేర్చు ॥
కరుణా మూర్తి ఓ సాయి ॥ కరుణతోమము దరిచేర్చోయి ॥
మా మనస్సే నీ మందిరము ॥ మా పలుకులే నీకు నైవేద్యం ॥షిరిడీ॥

**"శ్రీ సాయి చాలీసా సంపూర్ణం"**

